# ప్రతిభ

## ఆస్థానకవి సమ్మాన సంచిక

సమర్పణము : ౧౮. ౯. ౧౯౪౯



సంపుటము ౯ - సంచికలు ౧, ౨

సంపాదకుడు : తెలికిచర్ల వెంకటరత్నం

నవ్య సాహిత్య పరిషత్తు : గుంటూరు

రూపాయిన్నర

# ప్రతిభ

## ఆస్థానకవి సమ్మాన సంచిక

సమర్పణము : ౧౪.౯.౧౯౪౯





నవ్య సాహిత్య పరిషత్తు : గుంటూరు

సంపుటము ౯ సంచికలు ౧, ౨

# అనుక్రమణిక



★

# సమర్పణము

శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు నవ్యకవిత్వయుగారంభకులు. సాటి లేని ప్రతిభాపాండిత్యములు వెల్లడిస్తూ చేసిన కవితాయాత్రలలో దిగ్విజయము పొంది తమ కీర్తిపతాక సుస్థిరముగా నిలబెట్టుకొన్నారు. సహృదయుల హృదయపీఠాలలో గౌరవస్థాన మాక్రమించుకొన్నారు. వారి తరము వారు - వారికంటె పెద్దలూ పిన్నలూ కూడా - దిగ్గజములవంటి పండితకవులు పలువు రున్నా కవితాప్రపంచములో శ్రీ తిరుపతి వెంకటేశ్వరులే యుగపురుషులుగా ప్రతిష్ఠ గడించుకొన్నారు. వారి సాహిత్యయాత్ర ఒక మహోద్యమ మైనది.

శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు కవికులగురుదేవులు. గోత్రస్థాపకులు. "అస్మద్గోత్రం వర్ధతామ్" అన్న ఋషితుల్యులైన వారి వాక్కు తెలుగుకవితకు సాదరాశీర్వాదము ; కాదు పరప్రసాదమే.

శ్రీ వెంకటశాస్త్రిగారు గద్యరచనలో ఉత్తమ సంప్రదాయము పునః ప్రతిష్ఠాపితము చేసి వ్యావహారికభాషాగౌరవము నిలబెట్టడమువల్ల నేటి యువసాహితీపరుల కత్యంత సన్నిహితులై వారి మన్నన లందుకొన్నారు. నవ్యసాహిత్యపరిషత్తు వీరిని గౌరవాధ్యక్షులుగా వరించినది. దేశములోని సమస్తసాహిత్య సంస్థలూ గౌరవాంజలులు పట్టుతున్నవి.

మదరాసు ప్రభుత్వమువారు వీరిని ఆస్థానకవిగా ఎన్నుకొని వీరున్న తావున విజయవాడలో పట్టప్రదానమహోత్సవము చేయడము, కవీంద్రుని సన్నిధికి అమాత్యుల ఆస్థానము అవతరించడముగా, కవికి తిరిగి గౌరవస్థానము లభించడముగా గోచరిస్తున్నది.

ఈ శుభసమయములో సాటి కవులు, పండితులు, శిష్యులు ప్రశిష్యులు, ఆరాధకులు, అనుయాయులు, అభిమానులు, మిత్రులు ఎందరెందరో వ్రాసిన ప్రశంసా వాక్యాలు, పద్యాలు, కృతులు, వ్యాసాలు చేర్చి "ఆస్థానకవి సమ్మాన సంచికగా" నవ్యసాహిత్య పరిషత్పత్రిక 'ప్రతిభ' సమర్పిస్తున్నాము.

పరిషద్గౌరవాధ్యక్షా ! ఆస్థానకవీ ! స్వీకరింతురుగాక ! !

తెలికిచర్ల వెంకటరత్నం

# "కవిమూర్ధన్య"

## కళాప్రపూర్ణ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

కళాప్రపూర్ణ చిలుకూరి నారాయణరావు

ప్రభుత్వమువారు 'ఆస్థానకవి' అని బిరుదమిస్తే, నీవు 'కవిమూర్ధన్య" అంటావేమిటి అని అడుగుతారేమో. అవును, అదిఅంతే. Poet Laureate పొయట్ లారియట్ అనే పదానికి మిక్కిలిదగ్గరగా సరిపోయే అనువాదము 'కవిమూర్ధన్య' అగు. 'ఆస్థానకవి' అని కాదు. కవిమూర్ధన్యుడుకాబట్టి రాజో, రెడ్డో ఆయనను తన ఆస్థానములో చేర్చుకొనే వాడుకాని, అతడాస్థానకవి కాబట్టి కవిమూర్ధన్యుడు కాలేదు. ఆస్థానకవులందరూ కవి మూర్ధన్యులు కానక్కరలేదు. కవిమూర్ధన్యులాస్థానములలోచేరి భట్టుపొగడలతను చేయనక్కరలేదు, చేయలేరు, చేయకూడదు. చేస్తే భట్రాజు బిరుదాంకితులు కావచ్చు గాని 'కవిమూర్ధన్య' త్వాధికస్థులుకారు.

"ఆస్థానకవి" అనడానికెవరి ఆస్థానకవి ? పూర్వరాజుల దర్బారులలో ఆస్థానకవు లుండే వారన్నమాట నిజమే. కాని, ఇప్పుడెవరున్న దర్బారులు సాగింపవీలులేదే! సామ్రాజ్యవాద విచ్ఛేదమయి ప్రజాతంత్రమేర్పడినదే! అందుచేత వేంకటశాస్త్రి ఆస్థాన కవి కాదు. అట్టి పదవి కాతడెన్నడును ఆశించలేదు. ఆశించేఉంటే ఎందరో రాజు లాతని నాదరించి, గౌరవించి తమ మూర్ధములపై నుంచుకొని ఉందురు. ఆయన కవి దిగ్విజయ యాత్రలో ఆస్థానకవులను ధిక్కరించి తన కవిమూర్ధన్యత్వమును సుప్రతిష్ఠతము చేసు కున్నాడు. అతడు రాజులను లక్ష్యపెట్టలేదు. ఆరాజుల ఆస్థానకవు లాయనను తక్కువ పరుపచేసిన ప్రయత్నములు, అట్టి ప్రయత్నములను తన కవితాప్రభావముచేత విఫల ముల జేయుడము, మొదలయిన విషయములు ఆయన "నానారాజ సందర్శనము" వల్ల తెలుసుకోవచ్చును.

వేంకటశాస్త్రి స్వతంత్రుడు. అతడు జమీందారీ దర్బారులలోగాని, నేడు కాంగ్రెసు దర్బారులోగని, రేపు జస్టీసు, సోషలిస్టు, కమ్యూనిస్టు, దర్బారులలోగాని ఒకరి ఆజ్ఞలకు లోబడి సంచరింప వలసినవాడు కాడు. అతడాస్థానకవి కాజాలడు. అతని శిష్యులే ఎందరో ఒకొక్కరను ఆస్థానకవి కాదగినవారు, అయిన వారున్నారు, అతని కర్మము కాకుంటే అతని నాస్థానకవి అనడమేమిటి. అతడు కవిమూర్ధన్యుడు. "పొయట్ లారియట్"అనే ఉద్యోగమొక్క ఇంగ్లాండు దేశములో మాత్రమున్నది. దానినంతగొప్పగా ఎవ్వరున్నుచూడరు. పొయట్ లారియటులలో ఏముగ్గురో నలుగురోతప్ప ఇంగ్లాండులో

ప్రసిద్ధిపొందినవారు కనబడరు. కొందరనామధేయులు, కొందరు ఏమీ వ్రాయనే లేదు. ఇప్పటి పొయెట్ లారియటు జాన్ మేస్‌ఫీల్డు కొన్నిచిన్న గీతికలు వ్రాసినాడు. కొన్ని బాగున్నవి. అనేకములేమీ బాగులేవని ఆంగ్లవిమర్శకుల అభిప్రాయము.

ఇంగ్లీషు పొయెట్ లారియటును పార్లమెంటువారు నియమిస్తారు. అతనికి రాజదర్బారులో రాజునుంచి అయిదోస్థానము కుడివైపునఉంటుది. అతనికి 90 పౌనుల వార్షికము, ద్రాక్షారసముకోసము మరి 25 పౌనులిస్తారు. అతడు ఎట్టికవితనైనా చెప్పవలెననే నిర్బంధము లేదు-కొందరు పొయెట్‌లారియటులు రాజుగారికి కూతురో కొడుకో పుట్టినప్పుడుగాని, వారికి వివాహ సమయమప్పుడుగాని ఆశీర్వచన పద్యాలు వ్రాసేవారు. ఇటీవలి వారా పనికూడా చేయనక్కరలేదని వేసివారు.

తెనుగు ఆస్థానకవి కింకవీంద్రఘటాపంచాననుడు, శతావధానీత్యాది బిరుదవిఖ్యాతుడీ ఆంగ్లపొయెట్ లారియట్లవలె పడి ఉండవలసినవాడుకాడు— అతడు విశ్రుంఖలుడు. కవితాసామ్రాజ్యములో ఆతడెన్నడో స్వతంత్రజండా నెత్తినాడు. అతడాధునిక కవితా యుగకర్త. అతడు సహస్రమానజీవి కాబోతూఉన్నా, అతని భావములో నూనూగుమీసాలు నూత్నయౌవన పౌరుషము, అతని కవితలో లేజవరాలి చెక్కిళ్ళపై తరళితమౌతూఉన్న తళతళ కనబడుతూనే ఉంటుంది. ఆనాడేకాక ఈనాడున్నూ అతడు నవకవికులగురువు. కవి కుటుంబి. కవిరాజు, కవిసార్వభౌముడు, కవిసమ్రాట్టు. కవులతల మానికము, కవిమూర్ధన్యుడు. అతని కివ్వవలసినది వెండి పతకముకాదు. ఎర్రశాలువకాదు. వేయిరూపాయల కాగితపు ఛెక్కుకాదు. అతని కర్పింపవలసినది ఆంధ్ర కవికుమారుల అఖండగౌరవ పూర్వకమైన జోహారు.

వేంకటశాస్త్రిగారికీ పదవి కలుగడానికి ఆయన వయస్సు కారణము కాదు. వయసులో ఆతనికంటె వృద్ధులున్నారు. ఆయన వ్రాసిన గ్రంథమాల విస్తారములేదు. ఆయనకంటె ఎక్కువ పుటలను నింపినవారున్నారు. ఆయన కవితావైశిష్ట్యమున్నూకాదు. నవభావ కవులలో ఆయనకంటె లలితకవితను చెప్పగలవారుండవచ్చును. కాని, ఆయన స్వాతంత్ర్య ప్రియత్వములోని నవ్యాతినవ్యత్వము, నాటినుంచి నేటివరకు ఆయన చూపిన నిరుపమాన కవితాదీక్ష, ఆకర్షణశక్తి, క్రొత్తపోకడలలో యెప్పటికప్పుడు చూపిన ముందడుగు—ఇవి చాలును. ఈగుణము లితరులలో దుర్లభ్యములు. ఇందరీ పదవికోసము ప్రాకులాడి వెలితిపడినారు కాని, ఆయన చలించలేదు. తనకా పదవి రాదేమో అని దిగులుపడలేదు. ఒకప్పుడు సమస్త కవిలోక ధిక్కృతిచేసిన ఆ దుర్ధర్ష ప్రతిభాశాలి నేడు నిష్కామయోగియై కవితాప్రపంచమునకు నవ్యసందేశమునిస్తున్నాడు.

# చెళ్లపిళ్ల-గిడుగు చెలిమి

గిడుగు వేంకట సీతాపతి

శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి కిన్ని, మాతండ్రి, గిడుగు వేంకటరామమూర్తిగారి కిన్ని తొలిసారి పరిచయము 1915 సంవత్సరమున బందరులో అనుకుంటాను. ఆదినములలో మాతండ్రిగారు తమ వ్యావహారిక భాషావాదము సమర్థించుకొని నలుగురికిని నచ్చజెప్పడానికి తెనుగుదేశమంతటా ముఖ్యస్థలాల్లో సంచారము చేస్తూ ఉండేవారు. వారి సిద్ధాంతాలకు అనుగుణములయిన నిదర్శనాలు పరిశీలించడానికి బందరులో ఒకపండితవర్గ మేర్పడినది. ఆవర్గములో శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు కూడా ఉండిరి. మాతండ్రిగారు కవులప్రయోగాలు ఎత్తిచూపించినప్పుడు శ్రీ శాస్త్రిగారు తమ అభిప్రాయము ప్రత్యేకించి వ్రాసినారు. "పైని జూపిన ప్రయోగపంక్తులు తత్తద్గ్రంథములందున్నవి. ఆయాకవులుకూడ భ్రాంతివశమున నట్లు వాడియుందురు. ఈ ప్రయోగములలోఁ గొన్ని నిర్దుష్టము లయ్యును నిటీవల వారి యపరిశీలత్వము వలన నపప్రయోగములుగా నెన్నఁబడుచున్నవి. ఏది యెట్లయినను ఆయీవిచారము కవులకుఁగాని, సామాన్య రచయితల వ్రాతలయందు విశేషించి చూపఁగూడదనువాదము సత్యదూరము కాదు."

అప్పటిలో అంతవరకే వ్యావహారిక భాషావాదము శాస్త్రిగారంగీకరించినా కవులు తమ కాలమునాటి శిష్టవ్యవహార సిద్ధములయిన శబ్దరూపములను వాడుతూ వచ్చినారనిన్నీ, సకల విధములయిన వచనరచనలున్నూ కావ్యభాషలో కాక శిష్టవ్యవహారసిద్ధమైన భాషలోనే సాగిస్తూవచ్చినారనిన్నీ, ఒప్పుకొనక తప్పినదికాదు. శాస్త్రిగారు తమవాదమునకు అనుకూలురు కాగలరన్ననమ్మకము మాతండ్రిగారికి కలగడానికి ఈక్రిందను వివరించిన శాస్త్రిగారి వాక్యాలు కారణమైనవి:-

"లక్షణము సమగ్రముగా నిప్పటివఱకును బయలుదేరని హేతువున నీ యాంధ్రభాషకు లక్ష్యజ్ఞానమే విశేషించి యుండవలెను." పాశుపత పీఠిక పు. 53

"...ఈప్రయోగములెల్ల గ్రామ్యములే; పూర్వకవి సమ్మతింజేసి ప్రయోగార్హములయ్యె". పాశుపతము పు. 68

"మాకు నన్నయ్యకన్నఁ జిన్నయ్య యెక్కువవాఁడను నమ్మకములేదు" పాశు. పు. 76

"లోకమును విడిచినవాఁడు సర్వమును విడిచినవాఁడే. వాఁడు కవికాఁడనుటకన్న మనుజుఁడే కాఁడనుట యుక్తమని మా తాత్పర్యము."
పాశు. పు. 81

"పినాసి-ఇట ననుకరణము కలదు. లేకపోవుఁగాక. ఇది లుబ్ధునిం గుఱించి వాడెడి దేశ్యపదము; అపశబ్దమనుటకుఁ దగిన యాధారము లవమును లేదు; లేదు. దేశ్యము లన్నియు నపశబ్దములైనచో నిది యపశబ్దమగునని యెఱుఁగునది" పాశు. పు. 82.

"-ఇగో-అనుదానికి దేశ్యత్వమొప్పిన శబ్దరత్నాకర కారకుఁడు తక్కినవాని కొప్పకుండుట యక్కజము. ప్రవాహినీదేశ్యా-ఇవియేవియు భాగితకాలమునకు గ్రంథస్థములుగాఁ గన్పట్టవు. క్రమముగాఁ జేర మొదలిడినవి." పాశు. 89.

శ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారితో పరిచయము కలుగుటకు పూర్వమే శ్రీ తిరుపతి శాస్త్రిగారితో మాతండ్రిగారికి పరచయము కలిగినది. సాహిత్యపరిషత్ సభ కాకినాడలో కిళాంబి రామానుజాచార్యులవారి అధ్యక్షతను జరిగినప్పుడు గురుజాడ అప్పారావుగారు, మాతండ్రిగారు, నేను బుర్రా శేషగిరిరావు కాకినాడవెళ్లి పోలవరం జమీందారు కృష్ణారావు బహద్దరు వారింట బస చేసినాము. అక్కడ తిరుపతి శాస్త్రిగారుండిరి. బసలో వారితో భాషాప్రసంగములు జరుగుతూ ఉండేవి. 'గ్రాంథికభాష కొంతవఱకు

వ్యవహారభ్రష్టమైనది. వాడుకలో లేని శబ్దరూపాలు కష్టపడి నేర్చుకొంటేనే తప్ప చటుక్కున స్ఫురించవు. అట్టివి ప్రయోగించినప్పుడు పరిచయములేని ఇతర భాషలో రచనసాగించేటప్పుడు వచ్చే తప్పులువంటి తప్పులు సైతము రాకతప్పదు. 'మీరు వచ్చిరి' వంటి అపశబ్ద ప్రయోగము చేయని రచయిత నాకు కనబడ లేదు. అట్టి తప్పు మీ తిరుపతి వేంకటేశ్వరులు చేయ లేదను కొందును." అని మా తండ్రిగారన్నారు. అప్పుడు నేను "వీరూ చేశారు" అని "కవివరుల్ మముగెల్వఁడు గెల్చలేని" అనే ప్రయోగము చదివి వినిపించాను. అప్పుడు తిరుపతిశాస్త్రిగారు "'గెల్వ లేని' అని సులువుగా దిద్దుకోగలము; గాని, మా కున్న ఆతప్పు దొర్లినమాట వాస్తవమే" అని ఒప్పుకొని, అప్పటికి తమకుమీసములేకపోవుట సూచిస్తూ "మీరు వస్తున్నారనియే మీసము తీసివేసినాము" అని నవ్వుతూ తమ సౌజన్యము తెలియజేసినారు.

తిరుపతి వేంకటేశ్వరుల ఇద్దరియెడలనుమాతండ్రి గారికి గౌరవ మెక్కువగా ఉండేది. అందుచేతనే 1919లో మాతండ్రిగారు 'తెలుగు' అనే మాస పత్రిక నెలకొల్పి మొదటి సంచికలో తెలుగుభాషా పరిణామము రచించినప్పుడు ఈ క్రిందవివరించిన వాక్యాలలో తిరుపతి వెంకటేశ్వరుల మాటలు తమ వాదన కనుకూలములని ప్రశంసించినారు. "సరస కవులుకొందరు వాడుక మాటలను కావ్యములందు ప్రవృత్తి కల్పిస్తున్నారు. ఇతరులు ఆక్షేపిస్తే వారు భయపడరు. చూడండి ఏమంటున్నారో నేటికవులు కొందరు—

"కాలముఁబట్టి దేశమునుగాంచి ప్రభుత్వమునెంచి
దేశభా । షాలలితాంగి మాఱుటది సర్వవిసమ్మత
మాట, నన్నయాదే । శ్యాలును నాంధ్రభాషఁగల
వౌటను, నౌచితిఁబట్టి మేముక । బ్బాలనువాడు
చుంటి మది పండితు లే గతినొప్పకుందురో"

సెబాస్! తిరుపతి వేంకటేశ్వరకవులు! మీరు నిజమైన ఆత్మగౌరవముగల కవులు! 'కాలము, దేశము, ప్రభుత్వము, భాష—మారకతప్పదు. అన్యదేశములతో సంబంధ మున్నప్పుడు అన్యదేశ్యాలు భాషలో చేరకమానవు. ఔచిత్యము, అనౌచిత్యము ఏర్పరించడములో కవిహంస వంటి వాడు. తనఅంతఃకరణ ప్రవృత్తే కవికి ప్రమాణము.' ఎంత చక్కగా చెప్పినారు!

ఈకవుల కావ్యములను విమర్శించినవారు శబ్ద రత్నాకరమునుబట్టి, చిన్నయసూరి వ్యాకరణమును బట్టి, తప్పు లెన్నినప్పుడు, పంచాంగములో చెప్పక పోతే ఆకాశముమీద నక్షత్రాలుండరాదా ? అనీ ప్రయోగమూలం వ్యాకరణముగనుక ప్రయోగమే ప్రమాణమనీ, సిద్ధిర్లోకాద్వ్యశ్చా అనీ, నిరంకుశాః కవయః అనీ సమాధానము చెప్పినదేకాక,

"వ్యాకరణ మొక్కటే త్రోవ, మ
హాకవు లొక్క త్రోవ, కోశమఖిలమ్మొక త్రో
వైకను పట్టెడి నీభా
షాకావ్యమ్ములను దఱచు చదివినకొలఁదిక్."
"తొలిబాసయందుఁ బలె నీ
తెలుఁగుం బాసవెలయించు దీపములేమిన్
విలువగల కవుల లక్ష్య
మ్ములె తామీభాష మెల్ల మోయఁగవలయుక్".

అని తమ గ్రంథములో స్పష్టముగా తమ ప్రమాణము విశదపర్చినారు.

మాకు వీరే మార్గదర్శులు.

1926 లో తణుకులో ఆంధ్రసాహిత్య పరిషద్వార్షికసభ ఆచంట సాంఖ్యాయనశర్మగారి అధ్యక్షతను జరిగినప్పుడు, మాతండ్రిగారు సుమారు నా లు గు గం ట ల సే పు ఉపన్యసించినారు. వారిఉపన్యాసము శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, వేలూరి శివరామ శాస్త్రిగారు మొదలయిన పండితు లెందరో సాంతంగా విన్నారు. మహాకవులమని పెద్దపేరు పెట్టుకొన్న మహనీయులు కొందరు కృత్రిమభాషాప్రయోగము లెట్లుచేస్తున్నారో చూడండని శ్రీపాద కృష్ణమూర్తిగారి ప్రయోగాలు ఎత్తిచూపించినప్పుడు, కృష్ణమూర్తి శాస్త్రిగారేదో సమాధానము చెప్పబోతూ ఉంటే, చెళ్లపిళ్ల శాస్త్రిగారు, "ఊరుకో వయ్యా; అడ్డు తగిలావా అంటే మరిరెండు అపశబ్ద

ప్రయోగాలు మీరచనలోనుండి ఎత్తి చూపించగల డీ రామమూర్తి పంతులు. వారు చూపిస్తూ ఉన్న విషయాలు ఒప్పుకొని తీరాలి” అని అంటూ ఉండేవారు.

వచనరచనకు వ్యావహారికభాషే ఉచితమైనదిగా ఎంచి, వేంకటశాస్త్రిగారు వాడుకభాషలో రచించడం మొదలుపెట్టారనగానే మాతండ్రిగారు పరమానంద భరితులైనారు.

వేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవ సమయమున మాతండ్రిగారు వారినగూర్చి వ్రాసిన వాక్యములు చదువదగినవి.—

శ్రీ వేంకటశాస్త్రిగారి షష్టిపూర్తి మహోత్సవ సందర్భమున ప్రకటించుటకుగాను నలుగురితోపాటు ఒకటి రెండుమాటలు వ్రాసి పంపుటకు సాహసించినాను. శ్రీశాస్త్రిగారియెడల నాకుగల గౌరవమునకు సూచకముగా ఈ లేఖ వ్రాయడమునకు అవకాశమునాకు దొరికినందుకు మిక్కిలిసంతోషిస్తున్నాను. ధన్యుడను. నేటి తెలుగుకవులను ఎవరెన్నినా చిటికెన వేలిమీదికి ఎక్కేవారు మన తిరుపతి వేంకటేశ్వరులే. ఈ ఐకమత్యమునకు కారణము వారికావ్యములలో అందరికీ స్పష్టముగా కనబడే గుణసంపద కాక మరేమిటీ ?... మన తిరుపతి వేంకటేశ్వరులకు దేశభాషయెడల అభిమానము మెండుగా ఉన్నది. వీరు కావ్యములలో గ్రామ్యమువాడరు. కేవల గ్రామ్యపదముల నేవగించి జనులువాడెడి పదములు సమ్మతములు అని స్పష్టముగా తెలియజెప్పినారు... ఆయుస్సు, ఆరోగ్యము, ఐశ్వర్యము గలవారై మన వేంకటశాస్త్రిగారు ఆంధ్రసారస్వతాభివృద్ధికొరకు ఆయుశ్శేషముగడిపి ఆంధ్రులకందరికి ఆంధ్రకావ్యామృతము దొరికేటట్టుచేతురుగాక! అని కోరుచున్నాను ”

మాతండ్రిగారున్ను వీరున్ను 1939 లో తరుచుగా కలుస్తూ భాషావిషయములు చర్చిస్తూ ఉండేవారు. మాతండ్రిగారి వలెనే వీరున్నూ తెలుగు కావ్యాలన్నీ లెస్సగా పరిశోధించి భాషాపరిణామమును తెలియజేసే ప్రయోగాలు గుర్తిస్తూ ఉన్నవారు గనుకను, మనపూర్వులు వచనరచన అంతా శిష్టజన వ్యవహారసిద్ధమయిన భాషలోనే సాగిస్తూ వచ్చినారన్న విషయము తెలుసుకొన్నవారుగనుకను ఈ విషయములు గుర్తించని ఇతర పండితులవలె గాక శాస్త్రిగారు ప్రాచీనవచనరచనా సంప్రదాయమును పునరుద్ధరించి తమ వ్యాసములున్ను, కాశీయాత్రవంటి వచనగ్రంథములున్ను తమ వాడుక భాషలోనే రచిస్తున్నారు. వీరి వచనరచనా విధానములో ఒకవిశిష్టత ఉన్నది. నాలుగు పంక్తులు చదువగానే ఇది శాస్త్రిగారి రచన అని చట్టున తెలుసుకోవచ్చును. వీరి వ్యాసముగాని, గ్రంథముగాని చదువుతూ ఉంటే వారు మనతో ప్రసంగిస్తూ ఉన్నట్టే ఉంటుంది. ఈ రచనలు చదివేభాగ్యం మాతండ్రిగారికి లేకపోయినదని నేను విచారిస్తున్నాను. ఇప్పుడు మాతండ్రిగారు సజీవులై ఉంటే ఎంతో సంతోషించి ఉందురు; ఆస్థానకవులయినందుకు శాస్త్రిగారిని ఎక్కువగా అభినందించి ఉందురు.



# శ్రీ తిరుపతి వెంకట కవుల సాహిత్యయాత్ర

జమ్ములమడక మాధవరామశర్మ

తెలుగువారి తెలివిపంట అయిన విశిష్టసాహిత్యము తేనె వాకలుగా బయలుదేరి ఒక మహా స్రోతస్విని అయింది. ఆ రసానుభూతి తెలుగు వెలుగు పందిళ్ళలో సుఖాసీనులకు సులభమయినది. పిదప బుద్ధులయిన పిల్లధనికుల దుర్విలాస దుర్వినోద మదమోదరీతుల వలన ఆర్థిక విధానము దుస్తంత్రము పాలుకాగా ధర్మవ్యత్యయము జాతిని అప్రతిభము చేయగా సాహిత్యికత కొందరికి మాత్రమే అందీ అందని స్థితిలో ఉండడము, మరి కొందరు అసాహిత్యకతకే అధీనులు కావడము వలన జ్ఞాని అజ్ఞాని వర్గద్వ్యైధ మేర్పడింది.

ప్రాచ్యవిద్యలకు రాణింపులేదు. సంస్కృతాసక్తి సన్నగిలింది: దేశభాషారతి సురిగిపోయింది. అభారతీయము, అనాంధ్రము, అసాంస్కృతిక మయిన సంస్కృతి అలముకొన్నది. భూత పూర్వ సాహిత్యకులు కూడ జీవికా నిర్వహణానికి అన్య విద్యలను అన్య ప్రజ్ఞలను ఆశ్రయించారు. కవి పండిత యుగము మాసిపోయింది. వైయిక్తిక విద్యా వ్యాసంగంలో కృతహస్తులయిన వ్యక్తులు అస్వార్థబుద్ధితో జనసముదాయానికి విజ్ఞానభిక్ష నిచ్చే అవకాశాలు లేవు. అన్నీ అన్యాక్రాంతము లయిన దినాలలో ఆంధ్రసాహితి అగతికయై అనాదరము పాల్పడి దీనాదీన అయింది; ఈ సమయంలో తిరుపతి వెంకటకవుల ఉత్పత్తి నవచైతన్యమును సంపాదించింది. వారు దేశమంతటా ఒక సాహిత్యయాత్ర చేశారు. వారు మెట్టిన స్థలము లన్నీ సాహితీ తీర్థములు చేశారు. లోకానికి ఒక మేల్కొలుపు ఒక గగుర్పాటు కలిగింది. తత్ఫలితంగా ఈనాటి సాహితీ చైతన్యం ఈ విధంగా ఉంది.

తిరుపతి వెంకటకవుల సమకాలంలో పూర్వ కాలంలోనూ విశిష్టత కలిగిన సంస్కృత పండితులు ఆంధ్రపండితులూ కవులయిన వారున్నారు. వారికి వీరికి ఒక తేడా నేను భావిస్తాను. కొందరు తమ నిశ్చితానికి వంపులు లేకుండా చూచుకొని ఉక్కు కడ్డీలవలె ప్రవర్తిస్తారు. వారు వార్తమానికము సంభావించరు. లోకము అందుకోనీ ! అందుకోక పోనీ ! తమ స్థానంలో తాము సుస్థులవుతారు. తాము సమాజచక్రంలో జీవించుతున్నామని తెలుసుకున్నప్పటికీ సమాజము తమ పథమునే అనుసరించాలని పట్టుబట్టుతారు. అటువంటివారి పద్ధతిని లోకము అనుసరించదలచుకొన్నా అనుసరించలేదు. అందువలన వారి యత్నము అడ్డుపడగా ఉక్కు కడ్డీవలె విరిగిపోతుంది. తిరుపతి వెంకటకవులకన్న ఇతరులయినవారు ఏతాదృశులు. కనుకనే అట్టి వారు సాహిత్యయాత్ర చేసినట్లు లోకం గుర్తించ డానికి సూచనలేదు.

మరికొందరు పూర్వోతులవలె తమ నిశ్చితాన్ని మార్చుకోకపోయినా కాలదేశవ్యక్తుల ఒడిదుడుకుల జీవితగతి ప్రగతులలో అనుపానభేదం సూచిస్తారు. సనాతనములను వార్తమానికములలో పొదిపి లోకానికి పట్టుతారు. వారి రీతి రబ్బరు గొట్టమువలె మెత్తగా అటుఇటు ఓదిగినన్నీ తన లక్ష్యమును అందించడానికి యత్నించుతుంది. అది యెన్నడూ భగ్నముకాదు. తిరుపతి వెంకట కవులు ఇటువంటివారు. కనుకనే వారిది సాహిత్య యాత్ర.

ఈ సాహిత్యయాత్ర ఒక సారస్వతోద్యమమునె సృష్టించింది. తిరుపతి వెంకటకవులు ఉద్యమ స్రష్టలు, ఉద్యమ స్వరూపులు. సాహిత్యయాత్రా రూపముగా భాసించిన ఈ ఉద్యమము ఇక లోకంలో అంతరించదు. తిరుపతి వెంకటకవులు అమరజీవులు. అజరామరమయిన సాహితీ పవిత్రత తను పునఃప్రతిష్ఠితము చేసిన వీరిని, భక్తిభావమును

మఱచిపోవడము నేర్చుకొనని లోకము సాహిత్య యాత్ర చేస్తూ సాహిత్యతీర్థాలలో క్రుంకులాడి రసాస్వాదము చేయగలదు.

తిరుపతి వెంకటకవుల జంట అసాధారణప్రతిభ కలది. ఈ జంటను చూచి జంట గట్టిన కవు లనేకు లున్నారు. వారు వీరిని అనుసరించారు. కొన్ని జంటలవారు ఈ విశిష్టతను సంపాదించడానికి యత్నించినట్లు వినికిడి.

లోకానికి కవిత్వంపై అభిరుచి కలిగింది. కవికి లోకంలో సమాదరమున్నూ కొంత ఏర్పాటయింది. కవి తనను గుర్తింపచేయడానికి పాటుపడ్డాడు. కవి శాలువా వేసికొన్నాడు, కవిపద్యం పుచ్చుకున్నాడు. కవి పంక్తిభోజనం చేశాడు. కవి కవి అయినాడు. ఇదంతా తిరుపతి వెంకటకవుల చలవ. "నేను కవిని కావాలి" తెలుగు అభ్యసించే ప్రతి విద్యార్థీ ఈ అభిలాషకలవాడయినాడు. ఎట్లయినా తిరుపతి వెంకట కవుల శిష్యుడ ననిపించుకోవాలని తెలుగు కవి ప్రయత్నం. వారివలె యశస్సు పొందాలని, ఆవిధంగా కీవి చూపాలని, అట్లే పద్యం చదవాలని, తుదకు ఆవిధంగా పొడుం పీల్చాలని కూడా కవి యశఃప్రార్థులు కాంక్షించారు.

తిరుపతి వెంకటకవులు కవులు. పండితులు. విమర్శకులు. శాస్త్రద్రష్టలు. రసజ్ఞులు. తాత్త్వికులు. దేవీభక్తులు. లోకజ్ఞులు. ఈ విశిష్ట సమావేశము సర్వత్ర సులభము కాదు. "పండితకవయః కవయః కేవలం కవయస్తు కేవలం......" అని అభిజ్ఞులన్నారు. వీరు పండితకవులయిన కవులు. వ్యాకరణము అలంకారము జ్యోతిష తంత్రములలో నిశిత సూక్ష్మ ప్రవేశము కలిగిన వీరి ప్రత్యేకత వీరి రచనలందు అంతటా గోచరమవుతుంది. తిరుపతి వెంకట కవులనగానే అవధాన సంధానచతురులని లోకము గుర్తిస్తుంది. ఇతరుల అవధానాలలోకన్న వీరి అవధానాలలో గొప్ప విశేషమును లోకము రుచి చూచింది. కొందరు అవధాన పూర్వసమయంలోనే పద్యాలు వివిధ విషయాలపై అల్లిఉంచుకొని సమయంలో ఉపయోగించుతారు. వానినే కొంచెం అవసరానుకూలమయిన మార్పుతో అంతటా అందిస్తారు. అటువంటివానిలో అపునరుక్తి ఉండదు. తిరుపతి వెంకటకవుల అవధానాలలో పునరుక్తిలేని పద్యాలున్నవి. ప్రాతపద్యాలు లేవు. యెప్పటికప్పుడు అవి సమున్మిషితములయి ప్రకాశించడము శ్రీదేవీకరుణ; శతావధానసారము, నానారాజ సందర్శనము ఈ విషయంలో చూడతగినవి.

అవధానాలు చేయాలని అంతరావేదనం పొందిన అనంతర్వాణులయిన కవులు వీరి అవధాన పద్యాలను వల్లించేవారు. ధారాశుద్ధి సంపాదించేవారు. శతావధానములకు వీరివలన గౌరవము వచ్చింది. లేకపోతే అవి గారడీవిద్యలు. తాత్కాలిక చమత్కారసంధానములలో మాత్రమే వానికి సామర్థ్యము ఉంది. భావనీయమయిన భావగౌరవము కల వీరి అవధానాలు లోకంలో గొప్ప భావసంచలనము సంపాదించినవి. తెలుగుపై కవిత్వంపై అభిమానము లోకానికి కలిగింది. ఈ ప్రసక్తిలో గుర్తింపదగిన ఆంధ్రదేశభాగ్యం ఒకటి ఉన్నది. ఈ దేశాన అతిదరిద్రులు లేరు. అతి ధనికులు లేరు. సామాన్యంగా అందరూ మధ్యవర్గం వారు. వీరికి కొంత అశన వసనాలున్నది. సారస్వతాసక్తి చివికిపోతే తిరుపతి వెంకటకవులే అవధానాల ద్వారా ఆ ఆసక్తిని ఉజ్జీవితం చేశారు. ఈ యంత్రయుగంలో కూడా మధ్యవర్గంవారు కొన్ని జేబుడబ్బులు సంపాదించుకొన్నవాళ్ళయి సమకాలంలో సముదయం పొందిన సారస్వతాసక్తితో గ్రంథరుచి అందుకున్నారు. గ్రంథ ప్రకాశకులు ముద్రాయంత్రాలద్వారా గ్రంథాలు విరివిగా అందించి మధ్యలో లాభాలు బాగా పొందినారు. వారంతా తిరుపతి వెంకటకవులకు చిరకాలం కృతజ్ఞులయి ఉండాలి. దేశభాగ్యం ఇంకా అనుకూలంగా లేదు కాబట్టి రచయితలకు పఠితలకు కలిగే ద్రవ్యలాభాల కంటె మధ్యదళారులకు కలిగేవి ఈవిధంగా ఉన్నవి. అందువలననే తిరుపతి వెంకట కవులకు ద్రవ్యలాభం కంటె యశోలాభమే

అధికమయింది. ఇతరులకు అసూయాజనకమయిన అధిక యశస్సు వీరికి కలగడము మూలాన వీరి సాహిత్య యాత్రలో కొన్నిచోట్ల గందరగోళాలు కలిగినవి.

తిరుపతి వెంకటకవుల కవిత్వం ఎందుకు? వీరి సాహిత్యయాత్ర వలన ఏమి ప్రయోజనం ఘటించింది? ఈవిషయమై పర్యాలోచనచేస్తే నానా ప్రయోజనాలు భావనలో గోచరిస్తవి. కొన్ని పాఠకులకు, కొన్ని ఈ తిరుపతి వెంకటకవులకు, కొన్ని ఉభయులకున్ను, సాహిత్యప్రయోజనాలను సాహిత్యకాచార్యులీ విధంగానే సంభావించారు. నా భావపథం లో భాసించిన విధంగా వానిని ఇట్లు గుర్తిస్తున్నాను.

ఈ రససిద్ధులయిన భావమూర్తు లుదయించే సమయానికి దేశం దాదాపు భావదాస్యహితమయింది. స్వదేశీయతనుదిగజార్చుకొన్నది. జాతీయతను విస్మరించింది. జనతకు స్వభాషావేష సంస్కృతి సమాదరము సన్నగిల్లినది. దేశీయతను జాతీయతను ఆత్మీయతను ఉద్యోతింపచేయవలసిన అవసరం వచ్చింది. తిరుపతి వెంకటకవులు తమరచనలద్వారా భావోద్యమం నిర్వహించారు. ఆంధ్రులకు భావదీప్తి భావోత్తేజనం కలిగింది. కనుకనే భావోద్దీపనము వీరి కవితా ఫలములలో ఒకటిగా పరిగణిస్తున్నాను. వైజ్ఞానికంగా ప్రహతమయిన జాతి అంగోపాంగ సంపుష్టమయిన సారస్వతమును చవిచూడలేదు. అసలు ఆసక్తి అనేది కలిగితే ఔషధప్రాయంగా గుళికలు అందుకొని అందుకొని అజీర్ణం చేయకుండా ఎంతయినా పుచ్చుకుంటుంది. తిరుపతి వెంకట కవుల అవధానాలలో కాని ఇతరాంశాలలో కాని ముక్తక ప్రాయము లయిన కవితలున్నవి. వానిని యథాతథంగానే జనత ఆస్వాదించగలిగింది. నిజంగా అప్పట్లో అంతేకావాలి. వర్ణనాత్మకమయిన కవితను వీరుసమాదరించినా అష్టాదశ వర్ణన విధానమును అంతటా బనాయించలేదు. వర్ణనలు ఆస్వాదిస్తూ ఓపికపట్టలేని వారికి ఇవి రుచించవుకదా! ఇట్లని అసలు వర్ణన మానలేదు. ఈ రీతీతులు వీరి రచనలలో అంతటా గోచరిస్తవి. ఆర్థికంగా పాలనతంత్ర ప్రహతమయిన జాతి తత్సమయ చమత్కారా పాదక మయిన కథామాత్రమును అభిమానిస్తుంది. కొంత పరిపాకం కలిగితే వర్ణనకల కథనవగాహనంచేసి కొంటుంది. ఇంకా విశిష్టత కలిగితే శాస్త్రీయాంశ ప్రవేశము సహిస్తుంది. ఇంకా పరిపాకం కలిగితే వానిలో తాత్వికతను అవభాసింపచేసికొంటుంది. అంతకంటె పరిణత మయితే వాస్తవ సాహిత్యాస్వాదంచేస్తూ స్వసంవాద సుఖితమై స్పందసుందర మవుతుంది. ఈ స్వస్పంద సుందర మయిన సహృదయత్వము జనతకు కలగడానికి ఇంకా కాల పరిపాకం అవసరం. దాదాపు సమకాల ప్రజకు తిరుపతి వెంకట కవులు అపేక్షిత సారస్వతాన్ని అవసరంతో ఆవిర్భవింప జేశారు. కాబట్టి కవితాసక్తి సంపాదనమున్నూ వీరికవితా ప్రయోజనమని భావిస్తాను. వీరి శిష్యులమనిగాని ప్రశిష్యులమని గాని ఏకలవ్య శిష్యులమని గాని భావించిన కవులు ముక్తక రచనలు చేశారు. కావ్యరచనలూ చేశారు. శిష్యప్రశిష్య భావం ఆపాదించ దలుచుకోక దూరంగా ఉన్నవారున్నూ తమకు తెలియకుండా తిరుపతివెంకటకవుల ప్రభావ భావితులయినారు. వారు అనుకోకుండా వీరి అనుకరణం చేశారు. ఇదంతా ఇతరకవులు చేయజాలని వీరు మాత్రమే చేసిన విశిష్టవిధ అని అనిచ్ఛతోనయినా అందరూ అంగీకరించక తప్పదు.

అధీతి బోధా చరణ ప్రచారము లవసరములన్న మాటను శ్రీ హర్షుడు అందించాడు. ఇంకా రచనా స్వాదములనుకూడా తిరుపతి వెంకటకవులందించి పత్రప్రజ్ఞులయినారు. వీరిసమకాల కవులు ఇంతపని చేయలేదని జనత బాగానే అన్నది.

కావ్యప్రకాశలో మమ్మటుడు కావ్యప్రయోజనా లుల్లేఖిస్తూ యశోర్థములు, వ్యవహార విజ్ఞానము బాధానివృత్తులు, రసభావసంపద, ఉపదేశప్రాప్తి నిరూపించాడు. యీ కవులు యీ ప్రయోజనాలనన్నిటినీ సంధానించారు. వీరియశస్సు ఇతరులకు లేదు. సర్వభారతావనిలో అభివ్యాపనం పొంద

దగిన యశము వీరిది. ఆంధ్రులు అరవలవలె వంగీయులవలె ప్రకటనం చేసికోలేనందువలన సర్వభారతకీర్తి ఇంకారాలేదు. భారతభూమిలో ఏ రాష్ట్రంలో కాని ఇట్టి సంచలనం ఇచ్చిన కవులను మనము కనలేము. సర్వతోముఖంగా తిరుపతివెంకటకవుల సారస్వతమును సమీక్షించి ఖర్చు అనుకోకుండా భారతభాషలన్నిటలోనూ ప్రకటించితే అన్యరాష్ట్రీయులుకూడా అసూయాముక్తులవుతారు. పృథక్కరించిన వీరి రచనలను కొన్నిటిని సంస్కృతభాషలో అనువదించి ప్రకటించడము అవసరమని ఇక మనము గుర్తింపగలము. భారతభారతి అయిన సంస్కృతంలోనే ప్రశంసా సమీక్షచేసి యశోవిస్తరణం చేయడం యుక్తము. రచయితలుగా తిరుపతి వెంకటకవులు యశస్సముపార్జనం చేయడమేకాదు. వీరికావ్య పఠితలుకూడా యశోభాజనులయినారు. తిరుపతి వెంకటకవులు కావ్యప్రయోజనంగా ద్రవ్యసముపార్జనం చేశారు. అయితే ఇది వ్యాపారయుగం కావడంవలన సంభావించినంతగా అదిజరగలేదు. వీరిపేరుతో కొందరు వీరివలె ఆర్జించారు. అపరిమిత మయిన వ్యవహారవిజ్ఞానము వీరి కావ్యప్రయోజనము. శిష్యులువీరివద్ద కవితాభ్యాసం చేసే దినాలలోనే శిష్యులు నానావ్యవహార దక్షులయ్యేవారు. వీరి కావ్యాలు చదువుతూ ఉంటే అపరిచితములయిన ఎన్నోవిషయాలు సుపరిచితములవుతవి. వెంకటకవి ఉపన్యాసం చెపుతూ ఉంటే నానావిషయ పరిజ్ఞానం స్పష్టమవుతుంది. వారి చలోక్తులు సరసోక్తులు నర్మోక్తులు సూక్తులు ఎన్నో విషయాలను గోచరింపచేస్తవి. కవితలో కుదింపు పొందిన ఎన్నోవిషయాలు కొన్ని వ్యాఖ్యాపేక్షములయినా విషయ రసికులకు విశేష వేదనము చేయగలవు.

తిరుపతి వెంకటకవుల సాహిత్యయాత్రలో శివేతరక్షతివేదనానివృత్తి కూడా ప్రయోజనంగా కనిపిస్తుంది. కామేశ్వరీ శతకము, ఆరోగ్యకామేశ్వరి, ఆరోగ్యభాస్కరము, మృత్యుంజయస్తవము అనే వీరి గ్రంథాలు శివేతరక్షతికి అనుకూలాలు. ఆ కావ్యాలవలన యీ ప్రయోజనం వీరికేకాదు. ఆ కావ్యపాఠకులున్నూ ఆప్రయోజనం పొందగలరు. మయూరకవి సూర్యశతకం రచించి కుష్టవ్యాధి పోగొట్టుకున్నాడు. జయదేవుడు గీతగోవిందముద్వారా భార్యపద్మావతిని జీవింపచేసికొన్నాడు. వెంకటకవి ఇష్ట బాధానివృత్తిసంపాదించాడు. ఆరోగ్యాది సంపాదనకై సూర్యశతకాదులను అభిజ్ఞులు పఠిస్తుంటారు. సిద్ధవాక్కులయిన కవులు తమ విశిష్టకవితలను మంత్రశక్తి కలవానినిగా చేస్తారు. భక్తులు దేవధ్యానానికి ఉపయోగించే స్తుతులుఇటువంటివే. దేవీభక్తులయిన, తిరుపతి వెంకటకవులు దేవీస్తవంచేయనిదీ ఏపనీచేయరు. ఒకపద్యమేని చెప్పరు. ఒకొకపుడు ఆ అంతర్వాణుల లోపల దేవివాణియె కవిత నిర్వహించిందని వారి విశ్వాసము. లోకము విశ్వాసమున్నూ. అట్టి వారివచోభంగి మంత్రపూతమయిన దనడంలో దేవీదీక్షులకు సుప్రత్యయం ఉన్నది. ఇటువంటి దివ్యావదాన విషయాలలో అవసరమయినపుడు లోకం సందేహం విడిచిపెట్టి ఆయాశివేతర నివృత్తులకు ఆయాకావ్యస్తుతులను అనుసరించడమే యుక్త కార్యము. పైని చెప్పిన గ్రంథాలేకాక తిరుపతి వెంకటకవుల ఇతర గ్రంథాలలో ఫలప్రదములయిన స్తుతిఘట్టములు చాలా ఉన్నవి. వానిని ఒక ప్రత్యేక సంపుటంగా లోకం సమాదరింపగలగవచ్చు. యీప్రయోజనాంశ విచారణంలోనే దేవీభాగవతమును భావించాలి. అది ప్రత్యేక సమీక్షార్హము.

తిరుపతి వెంకటకవులు సమయదీక్షా స్వీకారంతో మంత్ర చైతన్యం సంపాదించిన దిట్టలు. తదుచితంగా తమ కవితలో ఉపాసనాశ్రద్ధ ప్రదర్శించారు. ప్రబోధించారు. ఇష్టదేవిని కేంద్రలక్ష్మిగా భావించి ఇతర దేవతలనుకూడా ఆరాధించి ఆరాధింపచేశారు. నానాభక్తి బోధనలు వీరికావ్యాలలో కన్పించుతవి. సనాతన సంప్రదాయానికి వీరు యీ మధ్యకాలంలో కొంత సారస్వతమును సృష్టించి ప్రచారకులయినారని ఇతరకవితలద్వారా అసనాతనులు సంతృప్తివహించినట్లు సనాతనులున్నూ

సంతుష్టులయినారు. నాదృష్టిలో తిరుపతి వెంకట కవులు ఏ రచనచేయనీ ! సనాతన సంప్రదాయమునే స్పష్టంచేసినట్లు గోచరిస్తుంది....... అభారతీయ పరిపాలనా విధానం వలన కొందరుమాత్రమె అక్షర ముఖులు కావడము కొందరు మాత్రమే సంతకం పెట్టగలవారు కావడము తటస్థించింది. అట్టివారు కూడా అర్థసంపాదనకు అవిరతంగా కొలువు కూటంలో కుదురుకొన్నారు. వారికి తీరికలేదు. అది ఉన్నా ఓపికలేదు. కొంత ఊపిరిపోసి వారికి వీరి కవితలు కొన్ని విశ్రాంతి జననం సంపాదించినవి. నాట్యకారు డయిన భరతుడన్నట్లు విశ్రాంతి జననం కూడా కావ్యప్రయోజనంకదా ! భరతుడు చెప్పిన సకల ప్రయోజనాలూ దాదాపు వీరి కవితలో కన్పించుతవి. వానిని ప్రత్యేకంగా సమీక్షించడం సముచితము.

కవితకు కవితాత్వమును ఆపాదింపగల అసలు ప్రయోజనము రసభావసంపద. అది తిరుపతివెంకట కవులకు ప్రహత మయిన దారి. వీరిఅవధాన పద్యా లయినా ఈ పథపతితములు కాక పోలేదు. సము చితంగా స్థాయిని బంధించి తగిన విభావాదికమును వినుగు కలుగకుండా ఉండేటట్లు కూర్చి రసీకరించారు. రసబంధా దృతమనస్కుడయిన కవికి కావ్యాంగములు తమంతట తాము ప్రసరించునని ధ్వనికారు డానందవర్ధను డంటాడు. వీరి విషయంలో అది అసత్యంకాదు. వీరి శబ్దార్థముల ఎన్నిక రసాభావ సముచితమైనది. కుంకుమరక్తిమ కపోలమునందువలె హారిద్రా పీతిమ కనకాంగమునందువలె సుశ్లిష్టము లయిన శబ్దార్థములు అన్యసాధారణములు కావు. రసభావ ప్రధానమయిన కావ్యసామగ్రి వీరికి అందు బాటులోకి వచ్చింది. కావ్యప్రమేయములను ప్రమితంగా వీరు కవితలో చూపగలరు. ఇదివిశిష్టప్రతిభ.

సర్వరస సర్వభావ నిబంధన దక్షత తిరుపతి వెంకటకవుల సాహిత్యయాత్రలో కన్పించుతుంది. విశేషించి వీరిద్ది శృంగారకవిత. "య తేరపి రతిర స్తి" అంటాడు, అభినవగుప్తుడు. వీరు అంతటా ఔచిత్యానపేతమయిన రతి వర్ణించారు. ఇంతశృంగార వర్ణనాశక్తి వీరికి ఏలకలిగింది? సమకాలంలో కొందరు వినోద విలాసరసికులయినారు. ప్రాచ్య శృంగార లీలలనేకాక అప్రాచ్య లీలలనుకూడా అనేకులు ఆదరించారు. అంతకంతకు అవే అధికమయినవి. వారి చిత్తవృత్తిని మళ్ళీ ప్రాచ్యరతి సుముఖం చేయాలి. అందుకై వీరు యత్నించారు. వినేయోన్ముఖీకరణార్థమై శృంగార మవసరమన్న ధ్వనికార సూక్తిని వీరు పాటించారు. అందునా కేవల ప్రాచీన పథాను సరణమె కాక అక్కడక్కడ నవ్యమార్గ శృంగారం నిరూపించారు. అటుముఖం పెట్టినవ్యక్తి ఇటు మోము త్రిప్పింది. ఇది వీరి శృంగార కథాతత్వం. స్వభావసిద్ధంగా వీరు రసికు లయినందున శ్రవణానందాది గ్రంథాలలో మధుర లలితరతిమతి ప్రదర్శించారనడము ఆపాత మధుర వాక్కు.

శృంగార వర్ణనకు మధుర రచన ఉండాలని ఆలంకారికుల మతం. అసమాస మధ్యమ సమాస అయినసంఘటనసంయుక్తవర్ణాలు,విశేషించిమూర్ధన్యములు, మహాప్రాణములు,మహాఘోషవర్ణములు మాటిమాటికీ ఉండరాదని అట్టిరచన మధుర రచన అని అదే శృంగారాను కూలమని సాహిత్యకులసూచన. దీనిని వీరు స్వీకరించక పోలేదు. ప్రసాదగుణ సుందర మయిన రచన సర్వ రస సాధారణమని ఆనందవర్ధను డంటాడు. ఆ ప్రసన్నరచన గంభీరమై వీరిసొత్తు అయిందని నేను నిశ్చయించుకుంటున్నాను. ప్రసన్నగంభీర వాక్కు కల కవులకు రసబంధానివేశము కలవారు నిత్యజయవాదము లర్పించాలి.

హాస్యము శృంగారాంగ మవుతుందన్నారు పెద్దలు. ప్రాచీన గ్రంథాలలో అది సభ్యముగా నిరూపితము కాలేదు. తిరుపతి వెంకట కవులు సభ్య హాస్యమును వర్ణింపకపోలేదు. విదగ్ధగోష్ఠి సన్నివేశాలలో వెంకటకవి వచోరీతి సుకుమార హాస్య ప్రచురంగా ఉంటుంది. సభ ఎంతసేసయినా ఆలేఖ్యలిఖితం అవుతుంది. అందరి హృదయాలకూ వికాసం కలుగుతుంది. "మేముశత్రుకోటి వారము"అని అనుకొన్నవారికిన్నీ అయత్నంగా హాసన్ముఖత్వం కల

గడము సర్వత్ర ప్రసిద్ధము. ఏ తత్కవుల హాస్యదేవతకు వేరొక శిరస్సు ఉంది. అది సర్వథా వెక్కిరిస్తుంది. తిట్టినట్లు కనబడుతుంది. తగాయిదా తెస్తున్నట్లు గోచరిస్తుంది. కజ్జాకోరు తనమున్నదా! అనిపింపచేస్తుంది. కాని ఆరీతిలో ఒకనీతి ఒకగతి ఒకమతి బోధలున్నవి. వీరికి వీరుగా ఎక్కడా తగాయిదా పడలేదు. తమ్ము కాదన్న వారిని తమ్ములనుగా చూడలేదు. తాము తలచిన నిశ్చితముపై ప్రమాణబుద్ధి వీరికి అధికము. యీ బుద్ధి కలుగచేయుటకే వీరు అట్టి విధానము అవలంబించారు. దీనిని ప్రామాణికు • లెవరూ కాదనరాదు. తమకు వెర్రిగా తోచిన పట్టుదలలను వీరు సహించలేరు. "పల్లెటూళ్ళ పట్టుదలలు" అన్న వీరి రచనలో అది స్పష్టము. అయితే అంతటా బ్రాహ్మణులనే అట్లు అన్నారేమి? ఇట్లు అనిష్టము లయినవి ఇతరులలో లేవా? బ్రాహ్మణాంగుళితో బ్రాహ్మణ చక్షువు పొడుచుట వీరికి బాధగ లేకపోయినదా? యీ ప్రశ్నలు తిరుపతి వెంకటకవులకు లేకపోలేదు. ఇతరులకు ఆదర్శప్రాయముగా ఉండవలసినవారు కుచేష్టలకు పాల్పడినపుడు వారినే ఎల్లేని మందలించితే లోక సంస్కరణం జరుగుతుందని వీరిఆశ. యీ ఉద్యమం లోకంలో అన్యథా ప్రస్తుతం కావడంలో అలము కొన్న అన్యములే కారణము. ఇంతగా ఇంతింతగా వీరి హాస్యరీతి ప్రసరించింది. జాతకచర్య, నానారాజ సందర్శనము, బిడాలోపాఖ్యానము, శనిగ్రహము, గ్రామసింహము, గీరతము, గుంటూరిసీమ, కలగూరగంప యీవిషయములో సంభావనీయ గ్రంథాలు.

లోకానికి సహజంగా వీరత్వముపై అభిలాష ఉంటుంది. ఆవీరులున్నా దీన్ని అభిలషిస్తారు. తిరుపతి వెంకటకవులు పాండిత్య కవిత్వ వీరులై విహరించినపుడు ఆ కృష్టలోకము కవితాముగ్ధమయింది. వీరు ఎదిరి వారిని ఏమేని అననీ! అందు చమత్కారముగా భావించి లోకము హర్షపులకమయింది. తిట్టుకవిత ఎంతకాలము నిలుచును? అని కొందరందురు. నిలవకపోవచ్చును. కాని వీరి కవితలో కేవల మా విధానమె కాక కొంత పంచదారఉన్నది. యిది తీపిసరుకు. ఎంతకాలమేని నిలుచును. దీనిలో విషయ విమర్శ యున్నది. తత్వకీర్తనమున్నది. వ్యాకరణ సాధుభావమున్నది. శబ్దపరామర్శ ఉన్నది. రూపనిర్ణయ మున్నది. ఇంకను అపేక్షితమున్నది. యివి కావలసిన లోకము ఆకలితను ఆదరించగలదు. నేటికిన్నీ వీనిని లోకము కాంక్షించుతూనే ఉన్నది.

తిరుపతి వెంకట కవుల సాహిత్యయాత్రలో సారస్వతకలహము చాలచోట్ల వచ్చింది. దానికి కారణాలున్నవి. వీరి కవిత్వానికి కవిత్రయము వారి భారతముపుష్టి. దానినిఅనుసరించి ఆప్రయోగచిత్రతా చిత్రీకృతులై వీరుప్రయోగించారు. కొందరకవి అసాధు శబ్దాలుగా అపశబ్దాలుగాఅవభాసించడమువలన విమర్శనలు చాలా వచ్చినవి. అప్పుడు వీరు సమాధానం చెప్పకోక తప్పదు. ప్రామాణికతను ఔచిత్య వర్తను ప్రదర్శించక తప్పదు. అందుకై అవసరము లయిన అనేకరచనలు వచ్చినవి. తెలుగు నాటగారెలు తింటారు. భారతము వింటారు. తెలుగువారి సంప్రదాయాచారాలన్నీ భారత భాషితాలు. ఆభారతము తిరుపతి వెంకట కవులకు ప్రాణము. కనుకనే విమర్శ వ్యాసాలలో "భారత సంస్కరణము, భారత విశేషములు" వ్యాసాలు బయలుదేరినవి. భారతముపై భరతభావము సముద్యోతితం చేయడానికి భారతనాటకాలు వ్రాశారు. ఇది నాటక చక్రంలో విమర్శనీయము. "పాశుపతీపేతక, పునశ్చరణము, శృంఖలా తృణీకరణము" వ్యాసాలలో పాండితీస్ఫురణము గోచరమవుతుంది. ఇవి ఇటువంటివి. ఒక నిమిత్తమై వచ్చి నావిషయగ్రహణాభి లాషులకు ఎంతో విశేషమును అందించగలవన్నమాట లోకంలో వినపడుతూనే ఉంది.

ఆంగ్లసంక్రాంతి వలన ఒక క్రొత్త సంస్కృతి పులుముడు అవతరించింది. ఇది జాతికి ఉత్తేజకం కాదని తిరుపతి వెంకటకవులకు తెలుసు. అందుకనే నవనాగరికుల శంకలు పిచ్చి శంకలని వీరు భావించారు. కేవలము భాషా ప్రధానంగాఉన్నంత

కాలము సారస్వతానికి రాణింపురాదని సారస్వతము ఎల్లప్పుడూ ఆంగ్ల సారస్వతము వలె విషయం ప్రధానంగా ఉండాలని పలికేవారి వాదంలో పలుకుబడనం లేదని వీరి భావన. చక్కని శబ్దసాధనకు వీరు దారులు చూపించారు. విస్మృత ప్రాయమైన కావ్యభాషను గ్రంథాలలో ఉపయోగించి పఠితలకు అందించడానికి యత్నించారు. వ్యుత్పత్తికన్న ప్రతిభకు కావ్యనిర్మాణంలో ప్రాధాన్యమును వీరు సాహిత్యకు లన్నట్లుగాఅంగీకరించుతారు. వ్యుత్పత్తి దూరులైన కొందరు పాశ్చాత్య సాహితీవాసను వాసితులై తమకు ప్రతిభ ఉన్నదని చాటించు కుంటూ "వ్యుత్పత్తి అక్కర లేదన్నంతవరకూ వాదులాడడం విని అటువంటి వారు కూడా వ్యుత్పన్ను లయ్యేటట్లు అనేక పర్యాయములు సుబోధ లిచ్చారు. వీరికి వ్యుత్పత్తిపై గొప్ప అభిలాష ఉంది. వ్యుత్పత్తి అంటే ఒక్క భారతీయ శాస్త్ర పరిజ్ఞానమేనా? ఇతరశాస్త్ర పరిజ్ఞానం మటుకు వ్యుత్పత్తి కాదా? ఈ ఊహ తిరుపతి వెంకట కవులకులేకపోలేదు. ఇతరమును వ్యుత్పత్తికాదనరు. అదిభారత తత్వానికి విపత్కరం కాకుండా ఉండాలని అభిప్రాయ పడతారు. ఏ నవీన విధానమునూ ప్రాచీనాదర్శములకు భంజకం కాకుండా ఉండాలనే వీరి ఆశయం. యీ ఆశయమును వాచ్యముగా అనకపోయినా తమసారస్వతమును భారతీయ సనాతన ధర్మ పతాకగా నిర్మించడము వలన వ్యంగ్యముగా సూచించినట్లు భావించవచ్చు.

ఏవిషయమును గానీ శాఖోపశాఖలుగా విస్తరించడమును వీ రభిమానించినట్లు తోచదు. ప్రతిపాద్య విషయమును కేంద్రంలో ఉంచి లలితమధురమయిన సుందరభాషలో చమత్కార ముద్రా ముద్రితంగా నిరూపించడము వీరి అభిలాష. సంస్కృతంవలన తెలుగు చచ్చింది అనడం వీరికి దుస్సహం. సంస్కృత విద్యాభ్యాసమును నియతంగా స్వీకరించిన వ్యక్తిమాత్రమే తెలుగు కవితకు మెరుగులు సంపాదింపగలడని వీరివాదము. గురుకుల వాసంచేసి చక్కగా నానావిద్యా వ్యాసంగము చేసిన తిరుపతి వెంకటకవులవంటి వారే ఈవిధంగా అనగలరు. సంస్కృతానుసరణవలన తెలుగులో పచ్చిశృంగారం వచ్చిందని అట్టి శృంగారఘట్టాలు పాఠ్యభాగాలలో ఉంచరాదని పలికేవారి శిక్షా నిమిత్తమై శృంగార రసమన్న వ్యాసరచన చేశారు. రచనలో ఉండవలసిన భాష వ్యావహారికమా? గ్రాంధికమా? ఈ భాషావివాదములో వీరు దేనినీ కాదనరు. విషయానుసారంగా భాషాప్రయోగం ఉంచాలని వీరిపక్షం. వెంకటకవి వ్యావహారిక భాషారచనలు అన్ని పత్రికలలోనూ ఉన్నవి. వారు రచించిన "కాశీయాత్ర" వంటివి వ్యావహారికం ఉండవచ్చు నంటారు. అతాదృశములను కూడా వ్యావహారికంగానే ప్రకటించారు. వ్యావహారికరచన అయిన నా నవరస గంగాధరమును వెంకటకవికి నమఃపురస్సరంగా ఇచ్చి వారిభావం సెలవీయవలసిందని కోరాను. గ్రాంధికం ఉంటే ఇంకా సంతసింపగలమని వారు అన్నారు. నాగ్రంథమును వ్యావహారికంగానే ఉంచాను.

శ్రీ తిరుపతి వెంకటకవులకు సంగీత రుచి ఉంది. గేయపాఠ్య వాఙ్మయములను దక్షంగా రచింపగలరు. అయితే పాఠ్యవాఙ్మయమునే సమాదరించారు. యీ రచనలన్నీ వాగీశ్వరికి భూషలు. వీరి ప్రౌఢగ్రంథాలలో చాలావరకు సంస్కృతానువాదాలు. కొన్ని పద్యకావ్యానువాదాలు. వీటిలో కొన్నింటిని పద్యకావ్యంగా వ్రాశారు. బుద్ధచరిత్రము ఇటువంటిది. కొన్ని గద్యగా వ్రాశారు. విక్రమాంక దేవచరిత్రము మొదలయినవి యీ దృశములు. హర్షచరిత్రవంటి గద్యకృతులను గద్యగానే వ్రాశారు. శ్రీనివాసవిలాసము, చంపూకావ్యానువాదము, మృచ్ఛకటికము, ముద్రారాక్షసము, బాలరామాయణము సంస్కృత రూపకాను వాదాలు. సంస్కృత వాఙ్మయచక్రంలో విలక్షణము సుందరమూ అయినగ్రంథమును వీరు ఆంధ్రంలో అందింపదలచి అనువదించారు. వారి విశిష్ట ప్రజ్ఞ ఉపజ్ఞ వీనిద్వారా ఆంధ్రులకు అందాలని తిరుపతి వెంకట కవుల యాత్ర. పండిత రాజజగన్నాథు డాంధ్రు

దని యాతని విశేషమును కమనీయ కవితలో అందించడానికి లోకప్రచలిత కథనే అందుకొన్నారు.

కవులు ఒకే కాలమునకు సంబంధించినవారు కారని దేశకాలమయులయిన్నీ దేశకాలోత్తీర్ణులుగానే ప్రకాశించాలని వీరు ఆశించారు. సమాజ మధ్యవర్తి అయిన కవి తానునడుస్తూ సమాజమును నడిపిస్తాడు. యీ విశేషము తిరుపతి వెంకటకవులకు ఉంది. ఎడ్వర్డు పట్టాభిషేకము బొబ్బిలి పట్టాభిషేకమువంటి గ్రంథాలను ద్రవ్యానికి రచించారని నేను విశ్వసింపను. కవులకు ఒకపారము వాని ద్వారా సూచితము. "సమకాల విశేషమును అనువర్తిస్తూ చిరాభీష్టమయిన స్థిరభావమును అంతటా ఆపాదించండి" అని.

కవులకు కవులపై సమాదరము ఉంటుంది. కవి ప్రయుక్తములందు వీరికి ప్రామాణ్యమధికము. ఆప్రయుక్త రూపములను ఆధారం చేసికొని తమరచనలపై ప్రామాణ్యము జనతకు ఉండి తీరాలన్నట్లు నిరూపణం చేశారు. కవి కవులకు శాసకుడు. సాహిత్య విషయంలో శాసనం అక్కరలేకపోతే పిదప సారస్వతం పుట్టుతుంది. జనసముదాయమును అపమార్గాన పెట్టేవారిని ఏ మాత్రమూ సహించ సక్కరలేదు. తన సాహిత్యము ద్వారా రచయిత జనతను ఎక్కడికో తీసికొని పోయి ఏతయాళువుగా చేయడం యుక్తం కాదు. ప్రకటనం పొందవలసిన వ్యాసరచనలను పత్రికా సంపాదకులుమీద పోస్తారు. రేడియో ప్రసారం పొందాల్సిన రచనలను తన్నియుక్తులు సమీక్షచేసి కాని ప్రసరింప జేయరు. అశ్లీలోక ప్రకటనం పొందేవానికిన్నీ ఒకజల్లెడ అవసరము. అదెయుక్తమయిన సాహిత్య సమీక్ష. తిరుపతి వెంకట కవులు అటువంటి సమీక్ష భంగీభణితి రమ్యంగా గోచరింపచేశారు.

దివాకర్ల తిరుపతి శాస్త్రి అస్తమించగా చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి హృదయోద్గారము దివాకరాస్తమయ కావ్యంగా పరిణమించింది. వాల్మీకి శోకము శ్లోకమయిందన్నారు. వెంకట శాస్త్రి శోకమున్నూ పుణ్యశ్లోక కీర్తనమై కావ్యకృతమయింది. రచయిత కది శోకమే కానీ పఠితలకది రసోల్బణకృతి అయింది. అనంతర కాలంలో వెంకటకవి చిత్తవృత్తి పరశివాసక్తమై భక్తి ప్రవణమై నిర్వేద కలితమై వైరాగ్య బోధక కృతులను వెలయింప చేసింది. తరువాత బయలు దేరిన ఏ కావ్యములో నయినా పరిణత భావము కనిపిస్తుంది. నిలవదొక్కుకున్న ప్రసన్నత గోచరిస్తుంది.

వెంకటాధ్వరి లక్ష్మీసహస్రమన్న కావ్యం రచన చేశాడు. దానిలో సంస్కృత కవితా పరిపాకము ప్రౌఢోల్లాసముతో భాసిస్తుంది. తిరుపతి వెంకట కవులు కాళీ సహస్రమన్న పేరుతో సంస్కృత కావ్యరచన చేశారు. అది అనుకరణంగా ఉన్నదని కాబోలు అంతా పూర్తి చేయలేదు. అదిచిన్ననాటి కృతిట. అయినా బింకంగాఉంది. కాళీ సహస్రం శ్లోకాలు కాళీ భక్తులకు పారాయణ యోగ్యములయినవి. దేవీభాగవతము తిరుపతి వెంకట కవుల విశిష్టదేవీ భక్తికి నిదర్శనము. అది అంతా తిరుపతి వెంకటకవుల రచన కాకపోయినా సూత్రపాతము వీరిదే. దేవీభాగవతము గాయత్రీ మంత్ర వ్యాఖ్యానము. ఉపాసకులకు అది నిత్య పారాయణము. దేవీ భాగవత రచనకు శాక్తదీక్షితులే అధికారులు. ఆ అధికారము తమ కున్నదన్న విశ్వాసమే వీరిని ఆరచనకు ప్రేరణ చేసింది.

గ్రంథాలకు పీఠికలు వ్రాసి అభిప్రాయములు ప్రకటించి వెంకటశాస్త్రి నానారచయితలను ప్రోత్సాహపరచడము అంతటా విదితము. ప్రోత్సాహమన్న పేరుతో అనవసరంగా వారు మెచ్చినట్లు తోచదు. ఆశ్రితపక్షపాతము చూపించారన నక్కర లేదు. ఎన్నో గ్రంథములను న్యాయదృష్టితో పరిష్కరించి స్వరూపశోభను అతిశయింప చేశారు. ఇప్పటికీ వెంకటకవి రచనాదక్షుడు. పూర్వమువలె ధారణాపటిమతగ్గితే తగ్గవచ్చు కాని కొన్ని వేల పద్యాలు వారికి కంఠస్థములై ఉన్నవి. తిరుపతి వెంకటకవులు ఒకపరిపూత సాహిత్య క్షేత్రము. వారు సాహిత్యయాత్ర ఇంతగా చేయగా ఏకాంశీ దక్షులై వారి సాహితీ వాసితులున్నా సాహిత్య యాత్ర చేస్తున్నారు. ఒక్కొక అంశంలో పటిమ కలవారున్నా సర్వాంశపటిష్ఠత కలవారు తిరుపతి వెంకటకవులు మాత్రమే. క్రొత్తగా వస్తు కల్పనం చేసినను చేయకపోయినను కల్పనా కౌశల్యం కల వారికి కలభాషలిచ్చారు. స్వస్వరూపంతో ఉండినన్నీ తిరుపతి వెంకటకవులు బహురూప చక్రవర్తులయి నారు. కవికి బెదురుపోయింది. ఆశ్రయింపు తగ్గింది. ఇక అన్నీ రసం అందవచ్చు. దీనికంతకూ వీరి సాహిత్యయాత్ర హేతువని మళ్ళీ మళ్ళీ చెప్పడము అందరికీ సంతసము.

శ్రీ తిరుపతి వెంకటకవి పదానికి మదరాసు ప్రభుత్వం ఆస్థానకవి పదవి నివేదించింది. ఆపదవీ ప్రతిష్ఠితుల ఆదేశసందేశోపదేశములను అమ్లానముగా త్రవ్వి తీసి కవిరూపుల కందరికూ అందించడం అత్యంతము అవసరము. తిరుపతి వెంకట కవుల లక్ష్యాలతో నవ్యంగా ఒకసాహిత్య శాస్త్రమును రచింపచేస్తే ఆంధ్ర లోకము సాహిత్యయాత్రా ప్రయోజన భాజనమవుతుంది. "అస్తు".



# ♦ వీరాభిషేకము

## రేడియో ఏకాంకిక

శ్రీ నండూరి రామకృష్ణమాచార్య

అంకితం

ఈ రూపక రచనకు ఉద్యోగవిజయాలే భవ్యకవితావేశం కల్పించినవి.

అంకితం ఏతత్ కృతికర్త గురు పితామహులు

శ్రీ చెళ్లపిళ్ల వేంకట శాస్త్రిగారికి

పాత్రలు:

| | |
|---|---|
| కర్ణుడు | భీష్ముడు |
| దుర్యోధనుడు | వంది |
| ద్రోణుడు | మాగధులు |
| అర్జునుడు | స్వస్తివాచకులు |

వందిమాగధులు

శ్రీ శ్రీ శ్రీ శ్రీ మన్మహారాజ రాజశ్రీ కౌరవకులాలంకార భారత సామ్రాజ్య చక్రవర్తి! విచిత్రవీర్య తనయ శ్రీ ధృతరాష్ట్ర సార్వభౌమా! జై జై జై

శ్రీ శ్రీ శ్రీ శ్రీమన్మహారాజ రాజశ్రీ కౌరవకుల భూషణ ప్రతిజ్ఞా పరిపాలన భీష్మ! జగదేక ధనుర్ధర, మందాకినీ నందనా! దేవవ్రత మహారాజా! జై జై జై!

రాజకుమారులు

గురుదేవులు శ్రీ ద్రోణాచార్య చరణారవిందములకు నమస్కారములు; నమస్కారములు.

ద్రోణుడు

బ్రహ్మార్పణమస్తు!

కౌరవరాజ కుమారులారా!

మన రంగభూమికి

పరశురామునంతటివాని భంగపరచి
నట్టి జగజట్టి గంగమ్మపట్టి మీ పి
తామహుండువచ్చె; భవదస్త్రనిపుణతను
జూడ ధృతరాష్ట్ర రాజేంద్రుతోడ నేడు.

ప్రేక్షకాగారము క్రిక్కిరిసి కిటకిట లాడుచున్నది. గాంధారీ మహారాజ్ఞి కుంతీమహాదేవి అంతఃపురం నుండి విచ్చేసినారు. పరీక్షాముహూర్తం సమీపించింది.

రాజకుమారులు

గురుదేవుల కృపాకటాక్ష వీక్షణాలు సర్వం నిర్వహింపగలవు.

ద్రోణుడు

రాజపుత్రులారా! అదుగో: సుముహూర్త ఘంటారావం. మీకు నా ఆశీస్సులు.

ఈ సమయమ్మునందు ధరణీశ్వర నందనులార మీర ల
భ్యాసము చేసినట్టి వివిధాస్త్ర విదగ్ధ శరప్రయోగ వి

♦ 1943 నవంబరులో చెన్నపురి కేంద్రంనుండి A. I. R. లో ప్రసారితం.

న్యాసము జూచి భీష్ముడు మనంబున మెచ్చిన మీ ధనుష్కళో । పాసనసిద్ధి జెందును, అపారముదం బొనగూడు నాహృదికిన్.

రాజకుమారులు

కృతార్థులము : కృతార్థులము

ద్రోణుడు

మొట్టమొదటి కార్యక్రమము గదా యుద్ధ ప్రదర్శనం.

తెరలో

(కలకలం) జై కౌరవరాజు కుమారులకు జై ద్రోణాచార్య గురువర్యులకు జై.

వందిమాగధులు

భీమసేన దుర్యోధన వీరవరులు
గంధసింధుర ద్వితయమ్ము కరణి మెరసి
ఉరుకుచున్నారు బిరబిరా నుగ్రముగను
మండితోద్దండ కరగదా దండులగుచు

తెరలో

భళీ! భీమసేనా! హా: దుర్యోధనా! గాంధారీ నందనా! భళీ: పాండురాజనందనా! హా! హా!

ద్రోణుడు

దుర్యోధన భీమసేన రాజపుత్రులారా! మీగదా యుద్ధకౌశలం అపూర్వం. క్రీడాంగణం యథార్థ యుద్ధంగా మారింది.
నేటికీగదా యుద్ధం సమాప్తి.

దుర్యోధన భీమసేనులు

మహాప్రసాదం. మహాప్రసాదం.

ద్రోణుడు

రాజనందనులారా! మీరందరు బద్ధతూణీరులై రంగభూమికి రండు.

రాజనందనులు

మహాప్రసాదం.

ద్రోణుడు

అదిగో! ఆ మర్రిచెట్టు చూచారుకదా

రాజనందనులు

ఆఁ ఆ! చూచుచున్నాము.

ద్రోణుడు

చిట్టచిటారుకొమ్మను ఊగులాడే పక్షియంత్రం కనుపిస్తోందికదా?

రాజనందనులు

ఆఁ. కనుపించుచున్నది.

ద్రోణుడు

మీలో ఎవరైన మూడుబాణాలతో ఆ పిట్టతల పైకెగురగొట్టి మొండెం క్రిందపడ గొట్టవలెను.

రాజనందనులు

(మౌనం)

ద్రోణుడు

రాజనందనులారా! మీరందరు మౌనముద్ర ధరించారేమి. దుర్యోధనా-బద్ధతూణీరుడవై బిరబిరా రా!

దుర్యోధనుడు

మహాప్రసాదం.

ద్రోణుడు

ఆ వటవృక్షం చూచావుకదా

దుర్యోధనుడు

ఆఁ !

ద్రోణుడు

ఏమి కనిపిస్తోంది.

దుర్యోధనుడు

మర్రిచెట్టు

ద్రోణుడు

ఇంక ?

దుర్యోధనుడు

కొమ్మలు రెమ్మలు

ద్రోణుడు

మఱింక ?

దుర్యోధనుడు

ఊగులాడే పక్షియంత్రం... ఆకులు... !

ద్రోణుడు

అన్నీ బాగా కనిపించుచున్నవా ?

దుర్యోధనుడు

ఆఁ! సమస్తం కనిపిస్తున్నవి.

ద్రోణుడు

దృష్టి చలిస్తున్నట్లున్నది. బాగా దీక్షతో చూడు

దుర్యోధనుడు

ఆచార్యవర్యా, నాకింకా దృష్టిమాంద్యం రాలేదు.

ద్రోణుడు

బాగున్నది. నీవు కొట్టినట్లే. నీవు నిష్క్రమింప వచ్చు.

దుర్యోధనుడు

కృతార్థుడను

ద్రోణుడు

భీమసేనా !

భీముడు

ఆచార్యవర్యులకు నమస్కారం.

ద్రోణుడు

ఆ పక్షియంత్రం చూచావుకదా

భీముడు

అక్కడ ఊగులాడేది ఏదో అదేనా ?

ద్రోణుడు

మరేమి - చూచావు. ఆమట్టిచెట్టు పై నున్న యంత్రం.

భీముడు

ఇంతవరకు తిన్నగా చూడలేదు. ఆ చెట్టును సరీగాచూస్తే ఇదివరకే వ్రేళ్ళతోసహా పెకలించి యుండేవాణ్ణి.

ద్రోణుడు

ఇదేమి ఆకారం ? పక్షియంత్రం భేదించటానికి ధనుష్పాణివై రంగభూమికి రమ్మంటే గద ఎత్తుకొని వచ్చావు.

భీముడు

ఆఊగులాడే కృత్రిమపక్షిపై బ్రహ్మాస్త్రప్రయోగం చేయటం నాచేతగాదు. కావలసిన ఇదిగో—నాగదాదండంతో కొమ్మ కొమ్మ గభీలున కూలేటట్లు ఒకవేటు వేస్తాను.

ద్రోణుడు

నీకు పుణ్యముంటుంది. మంచివాడవు. నీవంతపనీ చెయ్యగలవు. నిన్ను మరోసారి పిలుస్తాను.

భీముడు

మహాప్రసాదం—నన్ను వదలిపెట్టారు

ద్రోణుడు

అర్జునా !

అర్జునుడు

శ్రీ ద్రోణాచార్య గురుచరణారవిందములకు పార్థుని నమస్కారాలు.

ద్రోణుడు

బ్రహ్మార్పణమస్తు! కుంతీనందనా! ఆమట్టిచెట్టు చూచావుగదా!

అర్జునుడు

ఆఁ

ద్రోణుడు

ఆకొమ్మపై పక్షియంత్రం చూడు. ఏం ? కనిపిస్తోందికదా ?

అర్జునుడు

ఆ! కనిపించింది.

ద్రోణుడు

ఏమి సరిగా చూస్తున్నావా? ఏమి కనిపించింది.

అర్జునుడు

పక్షియంత్రం

ద్రోణుడు

ఇంక ?

అర్జునుడు

ఇంకేమీ కనిపించటంలేదు.

ద్రోణుడు

ఏమి ? ఇంకేమి కనిపించటంలేదూ. కొమ్మలు రెమ్మలు

అర్జునుడు

లేదు గురువర్యా? లేదు అనుజ్ఞ ఇచ్చిన

ద్రోణుడు

సంక్రంద నందనా !
పేరుగణించినారు పృధివీపతులందున అస్త్రవిద్యలో కౌరవరాజవంశ నరపాలురు నాటికి నేటికిన్ జగద్ వీరుడు మీపితామహుడుభీష్ముడు పెద్దలకీర్తినిల్పి నీ కూరతరంగ మధ్యమున చూపుము,కూల్పుము పక్షి యంత్రముఙ్.

అర్జునుడు

చరితార్ధుణి—(కొట్టును)

(తెరలో కలకలము– జయ నినాదాలు)

వందిమాగధులు

ఏడుదీవుల కవ్వలికెగురునట్లు
ఒక్కకోలతోతలకాయ చెక్కివేసి
కొమ్మపైపక్షి యంత్రమ్ము కూల్చినాడు
అర్జునుడు మేటి విలుకాల్పులగ్గలింప.

ద్రోణుడు

అర్జునా : నీ శిష్యత్వమువల్ల నాగురుత్వముకూడ సఫలమైంది.

మూడు లోకాలలో నీకు ఈడువచ్చు
వాడు లేడు నన్ మెప్పించి నాడవోయి
మేటి విలువిద్యలోన అమేయబలుడ
వగుచు సలుపుము వీరవిహారమింక

(తెరలో)

జై ద్రోణాచార్యులకు జై– పాండురాజకుమారుడు అర్జునునకు జై.

కర్ణుడు—ప్రవేశించి

సభాసదులారా? దండనాధులారా! రాజుగారి సొమ్ము దిను వందిమాగధులకన్న మిన్నగా మీకీ కంఠశోష ఎందుకు? ఈ వృధాజయనినాదాలెందుకు? కరచినవిద్యలఙ తిరిగికౌరవనాధునిప్రోల గొప్పగా గురునకు వప్పగింప శరకోవిదుడౌమొనగాడు వేరలేడరయగ మూడులోకములయందు నటంచువచింతురే ధనుర్ధరులకు, ఇంతకంటెకలదా? అవమానము రంగ భూమిలో !

ద్రోణుడు

మాగధా! ఈబాలవీరుడెవడు?

భారతసార్వభౌము సుతవర్గముచేరి పరిశ్రమించు కౌరవబాలకుల్ విచ్చియు చలింపకవింటినిబూని నారి టంకారమొనర్చి పోరగలగర్వముజూపుచు నిల్చినాడుబాలారుణరాగ రేఖలు నిజాననసీమనుతాండవింపగా

కర్ణుడు

అస్త్రకళా తారతమ్య నిరూపక నియామకాచార్య, ధనుర్నిగమాచార్య ద్రోణాచార్య
ఇంతమాత్రమునకె ఇంతింతలుపలికి
శిష్యునెంత గొప్ప చేసినారు !!
అనుమతించి రేని యంత్రమ్ము నొకకోల
నేలగూల్పగలను నేనుగూడ

ద్రోణుడు

స్వాభిమాన ధనుర్విద్యాప్రాగల్భ్య ! అదుగో చెట్టుపైయంత్రం. చేతనైన దానినికొట్టు.

కర్ణుడు

చిత్తం. (కొట్టును)

తెరలో

భళీ! జగదేకధనుర్ధరః అర్జునప్రత్యర్ధీ అసమానకోదండ విద్యాప్రవీణ. జై! జై!!

కర్ణుడు

అర్జునా !

మూడు లోకాలలో నీకు ఈడువచ్చు
వాడులేడులేడని చాటినాడు గురుడు
ఏకలవ్యుడు పాపము లేకపోయె
కలడు కర్ణుండు నీముందు కాచికొనుము.

అర్జునుడు

పిలువనిదే పెట్టనిదే ఇక్కడకురావటం, ఈ అధికప్రసంగం నాకు అర్ధంకావటంలేదు.

కర్ణుడు

రంగభూమి అస్త్రవిశారదులకందరికీ సామాన్యం. మీ గురువుగారి మూడులోకాల ప్రశంసకు అర్ధమేమిటి ? చేతనైన—

అర్జునుడు

సరే! కాచుకో.

కర్ణుడు

సరే! ఇదిగో (బాణప్రయోగం)

## తెరలో కలకలం

### వందిమాగధులు

ఖిలమీదన్ చెలరేగి వీరసమరావేశమ్ము నిండార తా
కిరి కర్ణార్జునులొండొరుల్ కినుకతో—క్రీడారణా
గారమ్ము దు
స్తరనీరంధ్రనిశాతసాయకతమస్సంఛన్నమయ్యెందిగం
తరముల్ నిండెను ప్రేక్షకప్రజలఆర్తధ్వాన
సంక్షోభముల్.

### ద్రోణుడు

కర్ణార్జునులారా! ద్వంద్వయుద్ధం చాలించండి. రాజమాత కుంతీ మహాదేవి మూర్ఛపోయింది.

### అర్జునుడు

ద్రోణాచార్య గురు వర్యులకు నమస్కారం.

### ద్రోణుడు

అర్జునా! విదురాదులు కుంతీమహాదేవికి శీతలోపచారాలు చేస్తున్నారు నీ వచటికి పోవచ్చు.

### అర్జునుడు

మహాప్రసాదం.

### దుర్యోధనుడు (ప్రవేశించి)

కర్ణాభిదేయా! జగదేకధనుర్ధరా! ఈదుర్యోధనుని సుహృదభినందనములు అందుకో—

నీ అత్యద్భుత పరాక్రమ ప్రదర్శనంతో ప్రేక్షకాగారమంతా మూర్ఛ పోయింది.

### కర్ణుడు

సార్వభౌమ నందనుని అవ్యాజ ప్రేమాదరాలకు నాకృతజ్ఞత.

### దుర్యోధనుడు

మహావీరుడా!

కలకలలాడు సోగతెలి గన్నులరాచకమ్మ శివి క్రొం
జిలుగు వెలుంగు సోయగము చిందు స్వయంప్రభ లీను
నైజ కుం
డలకవచాలు దివ్యజననమ్ము ను చెప్పక చెప్పు; ఏపురా
కలితవిశేష పుణ్యములు కల్పెనొ మాకు భవత్
సమాగమున్.

నీకులగోత్ర ప్రత్యభిజ్ఞలు తెలిసికో సభాసదులైన సకల సామంతదండనాథులు భీష్మకృపాచార్యాదులు చక్రవర్తి కుతూహలులై ఉన్నారు.



### కర్ణుడు

నేను రాధేయుడను సూతసూనుడ నభి
మానము కలదు విలువిద్యలోన నాకు
అభ్యసించితి బహుళ శస్త్రాస్త్రచయము
పరశురాముని కృపచేత పార్థివేంద్ర

### ద్రోణుడు

దుర్యోధనా! దైవానుగ్రహం వల్లకుంతీ మహాదేవి మూర్ఛనుండి తేరుకొన్నది.

### దుర్యోధనుడు

గురుదేవా! అయిన ఇంక ద్వంద్వయుద్ధంతిరిగి సాగింపవచ్చుగదా

### ద్రోణుడు

వీలులేదు!— సూతనందనా! వివాహ విద్యా వివాదాలు సాటివారిలోనేగాని తదితరులలో చెల్లుబడికాదు. కౌరవరాజకులాలంకారుడైన పార్థునితో యుద్ధంచేసే అర్హతనీకులేదు. కయ్యానికి కాలుత్రవ్వక రంగభూమివిడిచి తొలగిపోవటం ఉత్తమకర్తవ్యం.

### భీముడు

ఓహో! కర్ణా! సూతపుత్రా : ఆగు ; ఈ భీముని హితోపదేశం విన్నతర్వాత వెళ్ళవచ్చు. నీకు మాఅర్జునునితో యుద్ధం ఎందుకు? నీకులానికి సంస్కారానికి తగిన మంచిపని చెప్తాను విను. మా అర్జునుడికి ముఖ్యసారథివై రథం తోలు మా దుర్యోధనుడు నీకుమంచి ఒకటోరకమైన చెర్నాకోలు బహుమానంగా ఇస్తాడు.

### దుర్యోధనుడు

ఆశ్రితసోదర పరాక్రమ భాగధేయ! అనివేయ
కవచకుండలాల కాంతులన్ గానవా?
వెఱ్ఱిమాటలేల? భీమసేన!
పెద్దపులినిగన్న పిల్లికూనగలదా
కుంతిపుత్రులకిది వింతయౌనె!

గురుదేవా! శిష్యవాత్సల్యం ధర్మాన్నికప్పింది. పాలితవిక్రమక్రముడు భార్గవశిష్యుడుమీకుభీష్మభూపాలునకున్ సతీర్థ్యుడు సవాలును గైకొనివచ్చినన్ ధరాపాల సుతుండుగాడని నెపంబిడి పల్కుదురయ్యా, పార్థుతో । ఆలము సేయరాదని మహాత్మ వహింతురె పక్షపాతమున్.

ద్రోణుడు

సార్వభౌమనందనా! రాజమర్యాదలు కాపాడటం ఆచార్యధర్మం. చెప్పవలసిన విధికావున చెప్పాము.

దుర్యోధనుడు

గురుదేవా! మహాత్ముల జన్మాలు విచిత్ర గర్భితాలు, అనన్య సామాన్యాలు—మహాపురుషులజన్మ రహస్యాలు మహానదుల జన్మస్థలాలవలెఅజ్ఞేయాలు. అగమ్యాలు. కృపాచార్య గాంగేయ జన్మ రహస్యాలు దీనికి ప్రత్యక్ష నిదర్శనాలు. మహాశయా భవదీయ చరిత్రకూడ దీనికి అపవాదంకాదు—

ద్రోణుడు

వత్సా! నీవు ఉపన్యసించినధర్మం మాకు అవగతపూర్వం. అదుగో! చూడు. ప్రేక్షణాగారంలో నుంచి రంగభూమికి దిగి కౌగిలించుకొనే సూతునికి కర్ణుడు పాదనమస్కారం చేస్తున్నాడు.

దుర్యోధనుడు

సూతుడు ఎంతధన్యుడో కదా, ఆచార్యవర్యా, రాజకులంలో పుట్టినవాడు, రాజ్య పరిపాలకుడు రాజనామ గౌరవార్హులని మొన్ననే తాము శలవిచ్చినారుకదా!

ద్రోణుడు

నిజమే—అయితే.

దుర్యోధనుడు

అయిన గురుదేవా! నేడు కౌరవసార్వభౌముని నిండుకొలువులో అత్యద్భుత పరాక్రమం ప్రదర్శించిన ఈ మహావీరుడు కర్ణునికి అంగరాజ్యం బహుమానంగా ప్రసాదించుచున్నాము; త్రిలోకైక వీరుడైన కర్ణుని సన్మానించటం కౌరవ సామ్రాజ్య సామాన్య ధర్మం.

తెరలో

కౌరవ రాజకుమార దుర్యోధన జై జై
మహావీరకర్ణ జై—జై

దుర్యోధనుడు

బ్రాహ్మణమహాశయులారా! నేటి అస్త్రవిద్యాప్రదర్శనంలో అసమాన విద్యావైదగ్ధ్యం చూపిన మహావీరుడు కర్ణుని కౌరవసామ్రాజ్యం వీరాభిషేక మర్యాదలతో గౌరవిస్తోంది. యీ మహోత్సవ సుముహూర్తంలో మీఆశీస్సులు ప్రసాదించండి—

తెరలో

శుభమస్తు. అవిఘ్నమస్తు. సమస్త మంగళావాప్తిరస్తు.

దుర్యోధనుడు

బ్రాహ్మణ వరేణ్యులకు నమస్సులు. ఇవిగో కాంచనమణి మయాంబరాలు. నవరత్న ఖచితస్వర్ణ భూషణాలు. దానములుగా స్వీకరింప ప్రార్థన.

తెరలో

శతంజీవ శరదోవర్ధమాన ఇత్యభి నిగమో భవతి శతమానం తంభవతి శతమైశ్వర్యం భవతి శతమితి శతం దీర్ఘమాయుః

దుర్యోధనుడు

మహావీరుడా జగదేక ధనుర్ధర కర్ణా భారత సామ్రాజ్య సార్వభౌముడు నీ పరాక్రమం మెచ్చి, వీరాభిషేక మర్యాదలతో సమస్త రాజలాంఛనాలతో మణిమకుట కేయూర హారాది భుజకీర్తులతో అంగరాజ్యం ప్రసాదించాడు. దయతో స్వీకరించు. అందరు జూచుచుండగధరాధపనామముతో తఅంగరాజ్యందిరి కొలు గైకొని మహీసురమంగళగీతికాక్షతల్ చిందినరాజ చిహ్నమణిశిల్పకళావిలసత్ కిరీటముల్ మందమనోజ్ఞహాసముఖమండల మెత్తి ధరింపుమాళ్లి కై

కర్ణ

నాకు అంగరాజ్య పదవితో, దుర్యోధనరాజ కుమారునకు రాజరాజ పదవి ప్రాప్తించినది.

తెరలో

జై జై.

శతం జీ వశరణు.

# శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవుల ఆంధ్రీకృత నాటకములు

దివాకర్ల వేంకటావధాని, ఎం. ఏ. ఆనర్స్.,

ప్రబంధ యుగానికి పూర్వం వెలువడ్డ ఆంధ్ర వాఙ్మయంలో చాలాభాగం అనువాదరూపమే. ఆ కాలంనాటి కవులు సంస్కృత వాఙ్మయంలోని ఉద్గ్రంథాలనన్నిటినీ తెలుగు చేయడానికి ప్రయత్నించారు. నన్నయాదులు పురాణాలను, భాస్కర శ్రీనాథాదులు కావ్యాలను ఆంధ్రీకరించి తెలుగు పూబోడికి దివ్యాలంకారాలు కల్పించారు. ఆ కవీశ్వరుల ప్రతిభా మహత్త్వముచే వాటివన్నెవాలిప్పటికీ తరుగకుండా నిత్యనూతనములై ఎసలారుతున్నవి.

సంస్కృతవాఙ్మయంలోని ప్రసిద్ధకావ్య విశేషాలని పురాణములు, కావ్యములు, నాటకములు అని ముత్తెఱగులుగా వింగడించ వచ్చును. వీనిలో రసదృష్టితో పరికిస్తే నాటకాలది అగ్రస్థానం. అందుకనే 'కావ్యేషునాటకం రమ్య'మ్మనే అభియుక్తోక్తి యేర్పడ్డది. పూర్వాంధ్ర కవులంతా పురాణములతోను కావ్యములతోను మాత్రమే తృప్తిపడక, సంస్కృత నాటకాలుకూడా కూలంకషంగాచదివి, అందలి రసము నాస్వాదించుటచే పరవశులైనవారే. అయ్యును వారు సంస్కృత నాటకాలన్నిటినీ కాకపోయినా ఒక్కదానినైనా తెలిగించడానికి యత్నించకపోవడం కొంత ఆశ్చర్యావహంగా ఉంటుంది. అనువాదం చేయడానికే కాకుండా వారిలో చాలమంది స్వతంత్రంగానాటకాలు వ్రాయడానికికూడా తగిన ప్రతిభావంతు లనడానికి వారు శ్రవ్యకావ్యాలలో సైతము ఎడనెడ దృశ్యకావ్య పద్ధతులను ప్రకటించి ఉండడమే తార్కాణము. అందుచేత వారు నాటకాంధ్రీకరణము జోలికిగాని స్వతంత్ర నాటక నిర్మాణము జోలికిగాని పోకపోవడానికి ప్రతిభా భావముకంటె భిన్నమైన బలవత్తర కారణాలేవో కొన్ని వర్తిల్లి ఉండాలి.

సంస్కృత నాటకాల్లో పాత్రల ఉత్తమమధ్యమాధమాంతరములనుబట్టి వారు మాటాడు భాషలో కూడా భేదం గోచరిస్తుంది. స్త్రీ బాలసేవ కాదుల కందు ప్రాకృతమే వాడబడుతుంది. నిజానికి తెలుగువారా ప్రాకృతమున్నచోట్ల గ్రామ్యం వాడవలసి ఉంటుంది. కాని ప్రాకృతానికున్నన్ని కట్టుపాట్లు కాని గౌరవాదరాలు కాని పూర్వము తెలుగులో గ్రామ్య భాషకులేవు. పైగా అది వ్రాసినవాడు ఈలోకంలో పండిత రాజాదరణ పాత్రుడు కాకపోవడ మటుంచి మరణానంతరం నరకానికి వెడతాడని కొందరు విశ్వసించడంకూడా ఉండేది. అందుచే నీచపాత్రల కేలాటిభాష వాడవలెననే సమస్య పరిష్కరించలేక, నాటికి గ్రామ్యం వాడడానికి తగిన సాహసంలేక అప్పటి కవు లసలు నాటకంజోలికి పోవడమే మానివేశారు.

సంస్కృతంలో రూపకలక్షణాలను వ్యక్తీకరించే గ్రంథాలు చాలాఉన్నవి. తెలుగులో లక్షణ గ్రంథాలసంఖ్యయే తక్కువ. ఉన్న ఒకటి రెండింటిలో రూపకలక్షణానికి స్థానమేలేదు. చిత్రమేమంటే కొంచె మించుమించుగా ప్రతాపరుద్రీయాన్ని తెనిగించడానికే పూనిన భట్టుమూర్తి నరసభూపాలీయంలో రూపకప్రకరణం విడిచి వేసినాడు. తెలుగులో వ్రాయబడ్డ రూపకాలేవీ లేవుకదా, లేని వానికి లక్షణం వ్రాయడ మెందుకని ఆతడా ప్రకరణమువర్జించిఉంటాడు. రూపకలక్షణం లేకపోవడం ఒకవేళ ఎవరైనా నాటకాలువ్రాయ సంకల్పిస్తే వారి ప్రయత్నానికి కొంతవరకు ఆటంకమై ఉంటుంది. అదిగాక పదో శతాబ్దికి పిమ్మట సంస్కృత భాషకీ నాటకరచనకీ క్రమక్రమంగా ప్రోత్సాహం తగ్గుతూ రావడంచేత నాటకప్రదర్శనానికి కావలసిన రంగపరికరాదులకు కూడా అభావం కలిగి ఉంటుంది.

పూర్వాంధ్ర కావ్యాలలో ప్రత్యేక నియమం తో వ్రాసినవికొన్నీ, ద్విపద కావ్యాలు కొన్నీ తప్ప మిగిలినవన్నీ చంపూ కావ్యాలే. అనగా గద్యపద్యమిశ్రితాలే. మనపూర్వులు సంస్కృతనాటకాలనీ ఈ చంపువులనీ చదివి వాటితోడనే తృప్తిపడి నాటక రచన విషయమున ఔదాసీన్యం వహించిఉంటారు. శ్రీనాథుడు వీధినాటకము వ్రాసినట్లు ప్రసిద్ధిఉన్నది కాని ఆవీథికిని దశరూపకములలో నొకటైన వీధికిని ఏమీసంబంధములేదు. పైగా అది శ్రీనాథుడు వ్రాసినదన్న విషయంకూడా కొంతవరకు సందేహాస్పదంగానే ఉన్నది.

పైనిపేర్కొన్న కారణాలచేతను మరికొన్ని ఇతర కారణాలచేతను పూర్వకవులు నాటకనిర్మాణమునకు పూనుకోక పోవడం సత్యమే కాని రసప్రముఖులైన కొందరుకవులు సంస్కృత నాటకములను నాటకాలుగా కాకపోయినా ప్రబంధాలుగానే అనువదించి తమకు వాటిపైనున్న గౌరవాదరాలను వ్యక్తీకరింపక పోలేదు. కేయూరబాహు చరిత్రము, పిల్లలమర్రి పినవీరభద్రుని శకుంతలా పరిణయము, ప్రబోధ చంద్రోదయము ప్రబంధరూప మొందిన నాటకము లేకదా!

ప్రబంధ యుగానంతర మాంధ్ర వాఙ్మయమున యక్షగానాలు వెలసినవి. కాని వీటిలక్షణమునకును నాటకలక్షణమునకును చాలా వ్యత్యాసమున్నది. మనమిప్పుడు చూచుచున్న తెలుగు నాటకములకు సంస్కృతనాటకములే ఆదర్శములు కాని ఈయక్షగానాలు మాత్రము కాదు. ఇంకను ఈయక్షగానములే క్రమక్రమముగా హరికథల రూపంచెందినవని చెప్పవచ్చును.

కాగా క్రీ.శ 19వ శతాబ్ది పూర్వార్థము ముగిసే వరకు తెలుగులో నాటకమన్నదే వెలువడి ఉండ లేదు. అప్పుడుత్తర హిందూస్థానమునుండి, మహారాష్ట్ర దేశమునుండి కొన్ని నాటక సమాజములు తెలుగుదేశమునకువచ్చి హిందీ మున్నగుభాషలలో నాటకాలు ప్రదర్శించుటచేతను, ఆంగ్లభాష చదివినవా రందలి నాటకముల రామణీయ కాని కచ్చెరువడి అట్టివారిని మన భాషలోకూడా ప్ర... ఉత్సహించడం చేతను, నాటకరచన విషయంలో కొంతప్రయత్నము చేయబడెను. కొందరు సంస్కృత నాటకములను, గొందరాంగ్ల నాటకములను తెలిగించుటకు ప్రయత్నించిరి. అట్లు సంస్కృతనాటకముల నాంధ్రీకరింప మొదలిడినవారిలో కోరాడ రామచంద్రశాస్త్రిగారు, పరవస్తు రంగాచార్యులుగారు, కందుకూరి వీరేశలింగంగారు వేదం వేంకటరాయ శాస్త్రిగారు మున్నగువారు ముఖ్యులు. తరువాత పలువురు స్వతంత్ర నాటకములుకూడా వ్రాయ మొదలిడిరి. కొందరాంధ్ర దేశమునందలి పలుపట్టణములందు నాటకసమాజములను స్థాపించి తమరచనలను వాటిచే ప్రదర్శింప చేయుచుండిరి. ఒకవంక స్వతంత్రనాటక నిర్మాణమునందును మరొకవంక సంస్కృత నాటకాంధ్రీకరణము నందును కూడ సిద్ధహస్తులై మించినవారు శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవులు.

౨

తెనుగులో ఆంధ్రీకరణ పద్ధతి మూడువిధాలుగా ఉన్నదని చెప్పవచ్చును. మూలంలోని ఒకఘట్టం బాగాచదివి అందులో ఆవశ్యకాన్నిబట్టి కొంత తగ్గింపూ పెంపకమూ చేస్తూ యథేచ్ఛంగా రచన సాగించడం ఒకపద్ధతి. ఇందులో మూలానుకృతులందలి పద్యాలకీ భావాలకీ అంత సన్నిహిత సంబంధంలేకపోయినా కథలోమాత్రం అంత వ్యత్యాసం గోచరింపదు. ఇది మిక్కిలి స్వతంత్రమైన పద్ధతి. ఇందు అనువాదమేనైనా రచన స్వతంత్రకావ్యంలోలాగే సాగుతుంది. అందుచే మూలకర్త మనస్తత్త్వమే కాకుండా ఆంధ్రీకర్త చిత్తవృత్తి స్వభావాదులు కూడా ఇందులో తొంగిచూస్తూ ఉంటాయి. నన్నయ్య మొట్టమొదట భారతాంధ్రీకరణంలో ఈపద్ధతినే అవలంబించాడు. తిక్కన ఎఱ్ఱనలు తరువాత ఆతనిపద్ధతినే అనుసరించి భారతం పూర్తిచేశారు. నాచన సోమనాథునిదికూడా కొంచె మించుమించుగా ఈపద్ధతే. దీనినొకవిధంగా కథానువాద పద్ధతి అనవచ్చు.

ఇంక రెండవది శ్రీనాథాదు లవలంబించిన భావానువాదపద్ధతి. వారు మూలంలోని కథాంశాలనే కాకుండా భావాలనికూడా విడిచిపెట్టరు. ఏ శ్లోకాని కాశ్లోకాన్ని అనువదిస్తూ అనౌచిత్యం పరిహరించి ఔచిత్యం పోషిస్తూ కించిన్మాత్ర స్వాతంత్ర్యం ప్రదర్శిస్తారు. ఈపద్ధతిలో ఆంధ్రీకర్త ఆత్మీయతకంటె మూలకర్త మనస్తత్వాదులే యెక్కువగా ప్రతిఫలిస్తాయి. ఇందు కథాభావాల్లో స్వాతంత్ర్యం అంతగా గోచరింపకపోయినా పదగ్రథనాదుల వైశిష్ట్యంచేత రచన ధారాళంగాను, సహజంగాను స్వతంత్రప్రాయంగాను గోచరిస్తుంది. ఇది ఆంధ్రీకరణ విధానంలో మూలాన్ని అతిసన్నిహితంగానో అతిస్వతంత్రంగానో అనుసరించడమనే అతివాదం కాక మూలవిరుద్ధమైనా స్వతంత్రంగా వెలయించే మధ్యమపద్ధతికి చెందుతుంది. నామనస్సుకిది ఉత్తమ పద్ధతిగా గోచరిస్తుంది.

మూడవది ప్రతిపదానువాదపద్ధతి. ఆధునిక యుగంలోని సంస్కృత నాటకాంధ్రీకర్తలలో చాలామంది ఈపద్ధతినే అనుసరించారు. వీరిదృష్టి మూలంలోని పదాలన్నీ అనువాదంలోకి వచ్చాయా లేదా అన్నవంకకే కానిభావం విస్పష్టంగా వివరింపబడ్డదాలేదా, మూలకర్త భావతత్త్వం అనువాదంలో తేటతెల్లమైందాలేదా అన్నవంకకు ప్రసరించదు. ఈపద్ధతిలో కష్టమూ ప్రయత్నమూ ఎక్కువ; భావపుష్టి రసస్ఫూర్తి తక్కువ. ఇందులో మూలదాస్యం వలె మూలతత్త్వం ఎక్కువగా ప్రతిఫలించదు. ఒక్కొక్కప్పుడు పద్యంలోని పదాలన్నీ అర్థమైనా, పద్యం లక్షణయుక్తంగానే ఉన్నా మూలశ్లోకం దగ్గఱ ఉంటేనేగాని దాని సంపూర్ణార్థం అవగతం కాకపోవడం సంభవిస్తుంది. అనువాదంలోని పద్యం కంటె మూలంలోని శ్లోకమే సులభంగా బోధపడే చోట్లూ కొన్నిఉంటాయి. అనువాదకుడు బాహ్యమైన పదాది పరికరానికే కాని అంతరమైన భావగాంభీర్యానికి అంతగాప్రాధాన్యం ఈయకపోవడం ఇందుకు కారణం. అందుచేతనే రససముద్రాల చెప్పని దగ్గ కొన్ని సంస్కృత నాటకాలనైనా శ్రీనాథాదులనువదించి యుండలేదే అని మనం విచారించడం. ఈ మూడుపద్ధతులలోను మొదటిది కవి స్వాతంత్ర్య ప్రీతిని ప్రతిభాశక్తిని, రెండవది ప్రతిభాసంగతమైన పాండిత్య పరమావధిని, మూడవది కేవల పాండిత్య ప్రకర్షని ప్రదర్శిస్తాయి.

కొంచెమించుమించుగా ఇప్పటికి సంస్కృత నాటకాలన్నీ తెలుగులోనికి పరివర్తితాలై ఉన్నవి. కొన్నిటికి మూడు మొదలు పదివఱకూ పరివర్తనాలు ప్రకటింపబడ్డవి. ఈ అనువాదకులలో పలుమంది పై ప్రతిపదానువాద పద్ధతినే అవలంబించిన వారగుటచే వారి అనువాదాలకి దేశంలో అంతగా ప్రచారమూ రాలేదు, పేరూ రాలేదు. పేరు మోసిన అనువాదాలు స్వల్పసంఖ్యాకాలే అయినా పలుమార్లు ప్రదర్శింపబడి ప్రజాహృదయాలు ఆకర్షించాయి. అట్టి వాటిలో శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల అనువాదాలకు విశిష్టమైన స్థానం ఉన్నది. అపారమైన పాండిత్యం, దానికితగ్గ కవితాశక్తీ, నాటకోచితంగా పద్యంకూర్చే నేర్పు వారిలో పుష్కలంగా ఉండడమే వాటికాస్థానం చేకూర్చింది. వారినాటకానువాద పద్ధతి నిక్కడ స్థాలీపులాకన్యాయంగా పరిశీలిద్దాము.

3

శ్రీ తిరుపతి వేంకటేశ్వరు లనువదించిన నాటకాలు మూడు-ముద్రారాక్షసము, మృచ్ఛకటికము, బాలరామాయణము. మూడు మూడే. అనన్యసామాన్యాలైనవి. ఇందు మొదటి రెండున్ను సంస్కృత వాఙ్మయాని కలంకారప్రాయాలై జగదేకవిఖ్యాతి గడించినట్టివి. ఇంతప్రసిద్ధములైనా ఇతరసంస్కృత నాటకాలవలె వీనికన్నో అనువాదములు వెలువడి యుండలేదు. మరొకరెవ్వరో ఈ రెండునాటకాలకూ పరివర్తనాలు వెలయించినట్లు జ్ఞప్తి. అవియైనా ప్రకటింపబడినవేమోకాని ప్రసిద్ధికిరాలేదు. ఇంక బాలరామాయణానువాద విషయంలో తిరుపతి వేంకటేశ్వరు లద్వితీయులు. విస్తృతినిబట్టిచూడ సంస్కృత నాటకములలోనికెల్ల అగ్రస్థానము దానికే ఈయవలెను. దీని అనువాదమున కింకెవ్వ

రును పూనకుండుట కీ విస్తృతికూడా ఒక్క కార ణమై ఉంటుంది. ఈమూడునాటకాలూ కూడా బహుళ పద్యభూయిష్ఠములూ భావగంభీరములూ ఐనట్టివి.

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులలో ఈ నాటకము లను అనువదించిన వారెవ్వరనే క్లిష్ట సమస్యను నే నిచ్చట పరిష్కరించడానికి పూనుకోను. బాల రామాయణ ప్రస్తావనలో దీనికి సంబంధించిన సూచనకొంత ఉన్నది. మిగిలిన రెండింటివిషయమున అట్టిసూచనకూడా ఏమీ లేదు. నిశితంగా పరిశీలించి చూడగా వాటిని రచించిన వారొక్కరైనా ఇరువు రైనా మొత్తము మూడున్నూ ఒకే చేతిమీద సాగి నట్లు సాగినవి. వస్తు విస్తృతి భేద మెంత ఉన్నప్ప టికీ రచనలో మాత్రం సర్వత్ర సాధారణ్యం గోచ రిస్తున్నది.

అనువాద విషయంలో గమనింప వలసిన విష యం ఒక్కటున్నది. ఏ భాషలోనుంచి ఏ కావ్యా న్ని అనువదించినా చూచీ చూడడంతోనే ఇదిఅను వాదమనే అభిప్రాయంకాక, స్వతంత్రమే అనే అభి ప్రాయం కలిగింపజాలడం ఒకగొప్పశిల్పం. మూలం లో ఉన్న భావా న్నెలాగో ఒకలాగు వ్యక్తీకరించ డంతోపాటు మూలంలో మూల భాషలోని జాతీ యం ఎంత ఉన్నదో అనువాదంలో ఆ భాషలోని జాతీయం అంత వెల్లివిరియించడం ఆ శిల్పానికి ప్రాణం. అనగా సంస్కృత నాటకాల్లో సంస్కృత జాత్యములాగే తెలిగింపులలో తెలుగుతనం మూర్తీ భవించి ఉండాలి. అప్పుడుకాని అనువాద భ్రాంతి తొలగదు. పైమూడునాటకాల్లో అట్టి తెలుగు తనం సర్వతోముఖంగా, సర్వమనోహరంగా సంచా రం చేసింది. ఈ గుణవిశేషం ఇతరుల అనూదితనాట కాల్లో దృశ్యాదృశ్యంగా ఉంటుంది. సంస్కృత శ్లోకాలలోని మాటలనో వాటిపర్యాయ పదాలొన్నో గణ యతి ప్రాసానుకూలంగా మార్చి తెలుగులో పద్యం తయారు చేయవచ్చు. అదిసరియైన అను వాదం అయితే కావచ్చును కాని నిజమైన తెనుగు పద్యంమాత్రం కాదు. తెనుగులో ఆ భావాన్నే సొంతంగా వ్యక్తం చేసేటప్పుడు మన మా పదాలు వాడము. అంటే అనువాదంచేసే టప్పుడు మూల గ్రంథం ప్రభావము అనువాదమందలి భావంలోనే కాక భాషలోకూడా గోచరిస్తుంది. ఈ ప్రభావా న్నతిక్రమించి తన భాషలోని జాతీయాన్ని అను వాదకుడు ఎంత ఎక్కువగా ప్రయోగిస్తే అను వాదం అంత అందచందాలతో అలరారుతుంది. శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల అనువాదాల్లో తెలుగు జాత్యం నిండి తొణికిస లాడుతుంది. అందుచేతనే అవి సంస్కృత నాటకాలు చదువుతూ ఉన్నప్పుడు కలిగే ఆనందాన్నే పఠితకు కలిగింప గలుగు తున్నాయి.

కూరవరుగు చెడదు, గుమ్మడికాయయుఁ
జెడదు గోమయంబుఁ దోడిమఁబూయఁ,
బోదునీటికూడు, పొగచినమాంసంబు,
నావిరోధ మెన్ని నాళ్ళకైన.

మృచ్ఛ. ప్రథమాంకము.

అనే పద్యాన్ని మూలంతోపోల్చి చూస్తే ఈవిష యం తేటతెల్ల మవుతుంది.

వీరి అనువాదాల్లో సర్వత్ర భావానువాద పద్ధతి గోచరిస్తుంది. అన్ని పద్యాలలోను మూల శ్లోక భావాలు స్పష్టంగా వివరింపబడి ఉంటాయి. ఏ పద్యాన్ని అర్థంచేసుకోడానికి సంస్కృతశ్లోకం కోసం వెదకుకో అక్కరలేదు. అమూలకాలైన భావాలచ్చటచ్చట ఉన్నాయికాని మూలాతిరిక్త భావాలుమాత్ర మెచ్చటాలేవు. సంస్కృత శ్లోక భావం జీర్ణించుకొని తెనుగుకవి నేర్పుతో వ్రాసిన పద్యాలు కావడంచేత వాటిలో భావక్లిష్టత ఎక్కు డా ఉండదు. దీనికి పైమూడునాటకాల్లోని ఏపద్య మైనా తార్కాణమే. 'కింతేవయం కాష్ఠమయా మనుష్యాః' అనుదానికి 'పురుషులు కష్ట భాజనులు కారే' (మృచ్ఛ. అష్టమాంకము) అనునట్టి పాఠ భేదంచే ఏర్పడినట్టి వ్యత్యాసాలు కొన్ని ఉన్నాయి. అట్టివైనా మొత్తం మూడునాటకాల్లో పదిపదోకండు కంటె హెచ్చులేవు. యీ క్రిందివి అట్టి వానికి కొన్ని నిదర్శనాలు.

సం॥ కమలానాం మనోహరాణాం రూపాద్వి
సంవదతి శీలం

తె॥ సరసిజాతంబులవి మనోహరములైన
చంద్రురూపంబుచూడఁగా జాలవెపుడు
ముద్రా; 1 అంకము

సం. తంసంప్రత్యు పచీయమానమను
మేలబ్ధాంతరః సేవయా
లోభో రాక్షస వజ్జయాయయతే జేతుం
నశక్నోతిచ.

తె. అందుపచీయమానుఁడగు నాతనిగెల్వఁదలంచుఁ
గాక గె
ల్వందగునోటురాక్షసుఁడు లబ్ధసహాయుఁడౌటుల్
మదాశయున్. ముద్రా. 2 అం.

సం. చాణక్యోపిమదాశ్రయాదయమభిూద్రాజేతి
జాతిస్మయః

తె॥ తానజగన్నేతనటంచు గర్వపడెఁ జాణక్యుండు.
ముద్రా. 2 అం.

సం॥ ఏకశ్లాఘ్య స్సజీవత్యధికగుణతయా చోచ్ఛ్వ
సంతీవచాన్యే.

తె॥ వానిచే నిలిచెజగంబు లట్టి రమణీయ చరిత్రుని
నీ వెఱుంగుదే.

సం. ఉన్మీలితాపిదృష్టిః నిమీలితే వాంధకారేణ.

తె. కనులుమూసియు తెఱచిన గతినెయుండె.
మృచ్ఛ॥ 1 అంకము

మూలంలోని భావాన్ని గ్రహించిదాన్నే స్వతంత్రంగా వెల్లడించినచోట్లుఅచ్చటచ్చటున్నాయి. ఇట్టిచోట్లకొంత స్వేచ్ఛ గోచరించినా భావస్పష్టతకు కాని సందర్భశుద్ధికి కాని ఎచ్చటా భంగం కలుగలేదు. ఈపద్ధతిలోనే అనువాదాన్నికూడ స్వతంత్రకృతిగా ప్రతిభాసింపచేసే శక్తిఉన్నది. "గౌరీభుజలతా యత్ర విద్యుల్లేఖేవ రాజతే" అన్నదానికి "గౌరిచేతులగాటంపుఁ గౌఁగిలింత మెఱుపు కాన్పింపదను మేటి కొండఁతఁజేస్పె"నని అనువాదం. ఇది ప్రతిపద పరివర్తనంకాకపోయినా మూలభావాన్ని చక్కగా వ్యక్తంచేస్తూ దానికోవిధమైన వన్నెచేకూరుస్తోంది. ఇట్టివి మూఁడు నాటకాల్లోనూ చాలాఉన్నాయి.

సం. ఇదానీం ప్రకటశీర్షః నరేంద్రమార్గేణ విహరిష్యామి

తె॥ నేను భయముదీఱె మసలుచుండెద నిఁక రాజ
మార్గమంద. మృచ్ఛ. 2 అంక.

సం॥ శీర్ణత్వాత్కథ మపిధార్య తే వితానం.

తె॥ బిట్టునకునిల్చియున్నదీ యుల్లభంబు.
మృచ్ఛ. 5 అంక.

సం॥ దైవీచ సిద్ధిరపి లంఘయితుం నశక్యా.

తె॥ భాగ్యంబు రాఁ మోకాలొడ్డినఁ బోవునే
మృచ్ఛ. 6 అంక.

సం॥ నూర్యస్యోరసి నాథానాపి కురుతే వామేతరం
శ్రీః స్తనం.

తె॥ కుడిచనుమోవ మౌర్యవిభు గుత్తపుఁగౌఁగిటఁ
జొక్క నీవుగా. ముద్రా. 2 అంక.

సం॥ సంకేతకే చిరయతి ప్రచురోవినోదః......రక్త
స్యరాగ పరివృద్ధికరః ప్రమోదః.

తె॥ ముదమిచ్చుం బ్రియవిప్రలబ్ధయయి సంక్షోభిం
చుచోఁ గామికిన్...
మదనాటోపముపెంచు నొషసము సుమ్మీ యీ
గృహస్థాళికిన్. మృచ్ఛ. 3 అంక.

మూలశ్లోకంలోని భావాన్ని పఠితలకు విస్పష్టం చేయడం కోసము వివరించడం, కొద్దిగామార్చియో పెంచియో దానికి వన్నెచేకూర్చడం మూడునాటకాల్లోను విస్తారంగా ఉన్నది. కొన్నిచోట్ల మూలంలోలేని నిసర్గత్వం, ఔచిత్యం అనువాదంలో పుష్కలంగా కనబడుతుంది. వసంతసేన నడుమున దాల్చిన రశనాకలాపం "తారావిచిత్రరుచిర" మని మూలంలో ఉండగా 'చుక్కగింటల మొలనూల'ని తెలుగులోనికి అనువదించబడడం, 'నిర్ధనకస్య' అనుపదం 'జూదంబునందు ధనము చెడినవాని'కని వివరింపఁబడడం ఎంతో మనోహరంగా ఉన్నవి. "యది తావత్కృతాంతేన ప్రణయోఽర్థేషు మే కృతః" అను మూలపద్యపాదంలోని భావం "ఘాతుకుండగువిధి నన్నుఁ గలిమియెల్లఁబాపి కావించెఁగాక జీవచ్ఛవం" బని విస్పష్టం చేయబడినది. అశ్లేన తేన కశ్చిద్విభవైర్విమానితః' అన్నదానికి రిక్తు

లను బ్రోవనతఁడు దరిద్రుఁడయ్యెఁగాని యైశ్వర్య మదమునఁ గాదుసూవె" అనే అనువాదం కొంత దూరంగా ఉన్నా ఆ పద్యంలోని జాపమ్యానికి పుష్టి చేకూరుస్తూ ఔచిత్యాన్ని అధికం కావిస్తోంది. "ఎఱుఁగవే శక్రమునిదార కొఱకుఁ దొల్లి కోడి వైతివి, కాల్కంటివాడవైతి"వనే పద్యంలో కోడి వైతివనే పదమున్నూ, 'జంకిపోయెద వేల వేసంగు లందు నీడ కెఱకలు సాచిన నెమ్మివోలె"ననే పద్యంలోని నీడ అనే పదమున్నూ అమూలకాలే ఐనా అచ్చటచ్చటి భావాలకి ఎంతో అందం చేకూరుస్తున్నాయి. హైమంతరాత్రి సిద్ధమైన భక్తము చప్పన చెడదని మూలంలో ఉండగా 'పాచినీటికూడ'ని అనువదించడం ఎంతో సహజంగా ఉన్నది. నీటిలో వేసిన అన్నం పాసిపోకుండా దీర్ఘకాలం ఉండడం అందఱికీ అనుభవసిద్ధమైనవిషయమే! ఇట్లే "నగర్యాం విశుద్ధాయాం పశుఘాతమివ దారుణం" అనే శ్లోకపాదాన్ని "కాశిలోఁగోవుఁ జంపిన కరణి నేఁడు దారుణంబుగఁ జంపింతుఁజారుదత్తు"నని అనువదించడం ఔచిత్యభాసురంగా ఉన్నది. మూలంలో సంక్షిప్తంగా ఉన్న భావాన్ని చక్కగా వివరించిన పట్లు ముద్రారాక్షసంలో కూడా చాలా ఉన్నవి. దానికొక ఉదాహరణం.

సం॥ త్యయ్యుత్కృష్ట బలేఽభియోక్తరి నృపే సందాను రక్తే పురే.

తె. అభియోక్తయట చతురంగ సైన్యంబులయభివృద్ధి గల పర్వతాత్ముఁ డందు
భక్తిమతంబట పౌరమండలమెల్ల నందభూపాల కాన్వయమునందు'

మూలభావ మనవసరవిస్తృతంగా ఉన్నప్పుడు దానిని సంక్షేపించి సులభంగా సూచించిన చోట్లు కూడా ఎన్నో ఉన్నవి. అట్టిచోట్ల సాధారణంగా మూలంలో ఉన్న విశేషణాలు వర్జితాలౌతాయి.

సం॥ ప్రాకారం పరితః శరాసనధరైః క్షిప్రం పరిక్రమ్యతాం। ద్వారేషుద్విరదైః ప్రతిద్విపఘటాభేదక్షమైః స్థీయతాం.

తె॥ కోటచుట్టు భటుల్తిరుగుదురుగాక
ద్వారముల నిల్చుఁగాక దంతావళములు.

మూలమునందలి కర్మణి ప్రయోగములు భాషా సంప్రదాయానుగుణంగా కర్తరి ప్రయోగములుగా మార్పఁబడుట యిట గమనింపదగి ఉన్నది.

సం॥ ఏతత్తద్ధృతరాష్ట్రవక్త్రసదృశం మేఘాంధకారం నభః
హృష్టో గర్జతి చాతిదర్పితబలో దుర్యోధనో వా శిఖీ

తె॥ అంబికేయుని బలగమట్లయ్యె మిన్ను
పొంగుచుండెను రారాజుపోల్కి నెమలి.

మృచ్ఛ॥ 5 అంక

ఇందలి మొదటి పాదం మూలానికి విరుద్ధంగా ఉన్నది. దీనికిఁ గారణము పాఠభేదమై ఉండవచ్చును.

సం॥ ఏతాం దోషకగండికాం—మృచ్ఛ. 8 అంక.

తె॥ గోసములకూఁత, మవిన యావాసభూమి
కాలవశగత, దుష్ట, యీకాంతనన్య
రక్తఁజంపి చూపితిని శూరత్వ మిదిగో
చచ్చె భారతమున సీత చచ్చినట్లు.

మూలశ్లోకంలోని భావం తెలుగుపద్యానికి చాలనప్పుడు అవసరాన్నిబట్టి రెండుమూడు పాదాలు కల్పించి పద్యం పూర్తిచేయడం ముద్రారాక్షసంలో ఎక్కువగా గోచరిస్తుంది. సాధారణంగా ఇట్టి కల్పనలు. సీసపద్యములు వ్రాసినప్పుడే అవసరమైనాయి. అందులో ఉన్న సీసపద్యాలని మూల పద్యాలతో పోల్చిచూస్తే యీ సంగతి తెల్లమవుతుంది. మృచ్ఛకటికములో ఇట్టి కల్పిత పాదాలసంఖ్య తక్కువే కాని అసలు లేకపోలేదు. పంచమాంకమందలి అయిదోపద్యంలోను, అష్టమాంకమందలి 'నెమరు వేయుచు గోగణములు నిద్రింపసాగె' అనే పద్యంలోను చతుర్థపాదాలు కల్పితాలే. ఇట్లు కల్పింపఁబడ్డ పాదాలన్నీ సందర్భశుద్ధికలిగి, ఉచితభావ పరిపుష్టములై, మూలభావంతో అతికి సర్వత్ర సరస మధురంగా ఉన్నవి. ఈనాటకాల్లోని శ్లోకాలు సాధ్యమైనంతవఱకు కొక్కొక్క శ్లోక మొక్కొక్క పదంగా అనువదింపఁబడ్డాయి. ఒండు రెండు చోట్ల

మాత్రం మూలంలోని ఒకశ్లోకానికి తెలుగులో రెండుపద్యాలు వ్రాయడం. అందలి రెండు శ్లోకాలను తెలుగులో ఒకేపద్యంలో ఇముడ్చడం కనపడుతుంది. మూలశ్లోకాలలోని భావం చాలచోట్ల పాదక్రమాన్ననుసరించి వరుసగానే తెనిగింపఁబడ్డది. ఉపమానోపమేయాలున్న పద్యాలొకటి రెండింటిలో మాత్రం వాటి పౌర్వాపర్యం తారుమారైంది; (మృచ్ఛ. ఏతత్తుమాందవాలి.)

శ్లోకాలలోని అభిప్రాయం భావప్రధానంగాక విషయప్రధాన మైనప్పుడున్నూ, అంతరసభావ నిరంతరము కానప్పుడున్నూ, పాత్ర లాయా సందర్భాల్లో పద్యాలు చదవడం ఉచితం కాదని తోచినప్పుడున్నూ, వానిని వచనంలోనే ప్రకటించడం యీ మూడు నాటకాల్లోనూ అచ్చటచ్చట కనబడుతుంది. తృతీయాంకంలో శర్విలకు డేడు పేర్లుగల కర్మమార్గాలను పేర్కొన్న శ్లోకం వచనంలోనే వివరింపఁబడ్డది. ఇట్లే నవమాంకంలో అధికరణులు తమ ధర్మనిర్వహణంలోని కష్టాన్ని వెల్లడించిన పద్యాలు రెండూకూడా వచనంలోనికే అనువదింపబడినవి. మూలంలో ఆర్యకుడు చదివిన రెండుమూడు శ్లోకాలనువాదంలో వచన రూపం పొందినవి. దానికొక ఉదాహరణం.

సం॥ కృత్వైవం మనుజపతేర్మహద్వ్యళీకం
 స్థాతుంహి క్షణమపి సప్రశస్త మస్మిన్
 మైత్రేయక్షిపనిగడం పురాణకూపే
 పశ్యేయుః క్షితిపతయోహిచార దృష్ట్యా.

తె॥ మిత్రమా! మనము రాజున కప్రియంబొనర్చియటఁ దడయఁజనదు. ఆ నిగళము నాపాదునూతఁబడ వేసిరమ్ము. కానిచో రాజులు చారచక్షువులచే గుర్తింపఁగలరు.

ఇట్టి వచనీకరణములు ముద్రారాక్షసంలోకూడా రెండుమూడు కలవు. ఇవి సాధారణముగా నీచపాత్ర ప్రయోజితములైన ఆత్మగతాలు. ప్రథమ షష్ఠాంకాలలో చందనదాస పురుషులు ప్రవేశించునప్పుడు తమలో ననుకొన్న శ్లోకాలిందుకు తార్కాణం. కొన్నిచోట్ల శ్లోకంలోని ఒకటిరెండుపాదాలు వచనప్రాయాలుగా ఉండడంచేత వానిని అంతకుముందున్న వచనంతోకలిపి వచనంలోనే సంగ్రహంగా సూచించిన పట్లుకూడా ఒకటి రెండున్నాయి. తృతీయాంకములో 'అలం చతుశ్శాలమిమంప్రవిశ్య' అను శ్లోకప్రథమపాదం పైని విదూషకుని సంభాషణాని కనుగుణంగా "వలదు, వలదు" అని చక్కగా సంగ్రహంగా అనువదింపఁబడ్డది. మూలంలోకొన్నిచోట్ల పద్యములలో పౌనరుక్త్యం గోచరిస్తుంది. అట్టిచోట్ల నేదోఒకశ్లోకం విడిచివేయఁబడుతుంది. పంచమాంకారంభంలో మేఘాన్ని విష్ణువుతో పోల్చిన రెండు శ్లోకాల్లో ఒకటివిడిచిపెట్టఁబడింది. బహుశః అది ప్రక్షిప్తం ఐఉండవచ్చు.

ఈ నాటకాల్లో కొన్నిచోట్ల స్వల్పమైన శ్లేష ఉన్నది. దానిని కొన్నిచోట్ల అనువాదంలో రమణీయంగా ప్రకటించారు. కొన్నిచోట్ల వివరించి విడిచిపెట్టారు. ముద్రారాక్షసంలో 'క్రూరగ్రహః సకేతుః' అనేప్రస్తావనలోని శ్లోకమునకు 'క్రూరవుంగాము కేతువు దారిచంద్రు'నని అనువాదం. సకేతుః అనేచోట సంస్కృతంలోఉన్న విఱుపు తెలుగులో సాధ్యం కాకపోయినా భావాన్ని స్పష్టంగా వివరించారు. క్రూరగ్రహమైనకేతువు మార్గస్థిత చంద్రుసని యొకయర్థము. రాక్షసుఁడు మలయకేతువును (తారి=కదిసి) అని రెండో అర్థం. మృచ్ఛకటికంలోని "ఏతే ఖలు దాస్యాఃపుత్రాః అర్థకల్యవర్నావరటా భీతా ఇవ గోపాల దారకా అరణ్యే యత్రయత్ర న ఖాద్యంతే తత్రతత్ర గచ్ఛన్తి!" అనే వాక్యాన్ని "మిత్రమా! అరణ్యమునఁ గందిరీగలు కుట్టనిచోట్లఁ బరువిడు గొల్లపిల్ల వాండ్రవలె యీ పాడు సంపదలు కూడ తమ్మెవ్వరు ముట్టక ముడివైతురో వారి చెంతకే పోవుచుండు"నని చక్కగా వివరింపఁబడినది.

యీ అనువాదాలు మూడింటిలోనూ నీచ స్త్రీ సేవకాదులకు కూడా గ్రాంధికమే వాడబడినది. అయినా అది వ్యవహార సన్నిహితమై, జాతీయమై

మనోహరంగా ఉన్నది. వచనమంతా మూలాను సారిగానూ, సరసమధురంగానూ అనువదింపబడ్డది. కొన్ని చోట్ల ఇందునూస్వల్పమైన వివరణమున్నది. "సుష్ఠుఖల్విదముచ్య తేరత్నం రత్నేనసంగచ్ఛతేఇతి" అనుదానికి "బాగుగానున్నది. రత్నమురత్నముతో గలియక గాజురాతితోఁ గలియునా" అను కించిద్వివరణముతోకూడిన అనువాదం ఎంతో అందంగా ఉన్నది. ఇంక శైలివిషయం; శైలిసర్వత్ర జాతీయమై, సులభమై అత్యంత మనోహరంగాఉన్నది. వ్యవహార సన్నిహితమైన భాషే ఐనా ఎచ్చటా బిగువు సడలక అతి ప్రౌఢంగా ఉన్నది. సాధారణంగా అనువాదాల్లో సంస్కృత పదాలు ఎక్కువగా పడతాయి. పద్యాలు ప్రయత్న పూర్వకాలై అచ్చటచ్చట కుంటుపడుతూ ఉంటాయి. కాని యీమూడునాటకాలూ అందుకుఅపవాదం. ఎచ్చట చూచినా జాతీయమై మృదుమధురమైన తేట తెనుగు వెల్లివిరిసిఉన్నది. అందులోనూ మృచ్ఛకటికంలో ఆ భాషా సౌందర్యం మరీ గమనీయంగా ఉన్నది. అందుకే పద్యమైనా ఉదాహరణంగా చూపవచ్చు. పద్యాలు సొంత పద్యాలవలెనే సహజ ధారాళంగా నడచినవి. కుంటినడక కంచుకాగడా పెట్టి వెదకినా కనబడదు. అనువాదాన్ని ఇంతసహజంగా వెలయించడం యీకాలంలో చాలామందికి చేతగానిపని. భాషాఛందస్సులు చాలాచోట్ల రసోచితంగా ఉన్నవి. ప్రాసాక్షరి మేదైనా, వృత్త మేదైనా పద్యం శ్రవణానందంగా నడచింది. మచ్చుకి రెండు పద్యా లుదాహరిస్తాను.

సర్వత్యాగివిసప్తముండవువిరించ స్వామికిన్ శిష్యతన్
నిర్వాహించితి పీకునొద్దనని నేనిన్నింతమన్నించితిన్
గర్వోన్మత్తుల్ విడుమయ్య వీరసరణిన్ గైకొందునా
కిందుని
నోన్నర్వన్ రాదిఁక నూరకుండిన గురుండున్వాఁడిదే
నిగ్గిలున్. (బాలరా) 6 అంకము

ఊర్జితదానశక్తివయి యొక్కఁడవై చరియించుచున్మదోన్
సూర్జితమైన యాత్మబలముంగొని పొంగెడు
నిన్ను బుద్ధిసం
తర్జితుఁజేసి యేవిపిన దంతి విధంబునఁ గట్టివైచి మా
కర్జముఁదీర్చికొందుఁ బెఱకార్యము లేల మురాన్వ
యార్థమై. (ముద్రా) 1 అంక

మొదలిడరు విఘ్నభీతిచే మూర్ఖజనులు
విడిచెదరు మధ్య మధ్యముల్ విఘ్ననిహతి
మొదలిడిర యేని యది తుదముట్టువఱకు
వదలిపెట్టరు కార్యంబు ప్రాజ్ఞమతులు.
ముద్రా 2 అంక

దొంగచేత్మైయు నాఁబోతు, దొంగరతుల
కాసపడు బొజుంగును, జూదమాడువాని
దుష్టులకు సహజంబగు దుర్గుణంబు
బ్రహ్మకైనను మానింపఁగఁదరంబె.
మృచ్ఛ 3 అంక

యీవిధంగా శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల అనువాదాలు మూలాను సరణంలోనూ, * భావప్రకటనంలోనూ, మృదుమధురమైన శైలిలోనూ, ధారాశుద్ధిలోనూ, జాతీయపద ప్రయోగంలోనూ, శబ్దసాధుత్వంలోనూ అనితరసామాన్యాలై అతిమనోహరంగా ఉన్నవి.



* మూలందొరకక పోవడంచేత బాలరామాయణంలోనుంచి ఉదాహరణ లీయలేకపోతిని. పఠితలు క్షమింతురుగాక.

# కవిరాజ నాటక చక్రము

వేంకట శేషయ్య

—: నాంది :—

గీ॥ అర్తులకెవండు సంజీవనౌషధంబు।
గల్పపాదపమెవడు భక్తగణములకు।
నెవనిమాయదురూహ మాయాశ్వరుండు।
శుభములిడు జగన్నాటక సూత్రధారి॥

ఆర్యులారా !

మన కవుల సారస్వతం అంతులేని పెనుసముద్రం. సముద్రాన్ని చేరితే సౌఖ్యం ఆనందం గలిగే మాటనిజం కాని, ఆశ్చర్యం భయం కూడా కలుగుతుంది కదా! రత్నాల కాసించి అందులో ఎవరైనా దూకితే వారు బ్రతికి బయటపడ్డా పడవచ్చు, లేకపోతే పోనూ పోవచ్చు. పోనీ, రత్నాలు కనబడ్డా, ఒకదానికంటె ఒకటి ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూ కనులు మిఱుమిట్లు గొలిపితే వేటిని గ్రహించాలో వేటిని త్రోసిరాజనాలో తెలియక తికమకలు పడుతూంటారు కూడాను. దేవదానవులు మహోదధిని మధిస్తే, అనర్ఘ రత్నాలూ, అనంత ప్రద్యుమ్నాలూ, లక్ష్మీప్రభృతి సుకన్యా మణులూ, ధన్వంతరివంటి కవిరాజులూ,(వైద్యులు) లోకాలకానందం గూర్చే విబుధచంద్రులు మృతికి మృతికూర్చే అమృతం, ఇంకాచాలాచాలా అవతారాలు బయటపడ్డాయట. ఇంతకూ ఉద్యోగం కలవారికి వ్యసన పరాజయమే కాకుండా అభీష్ట విజయము, స్వస్థానంలో పట్టాభిషేకమూ కలుగుతాయి. నాటకాంతం సాహిత్యం అన్నారు అభిజ్ఞులు. అంటె శ్రవ్యకావ్యపఠన పాఠన రచనానంతరమే నాటకాలమాట తలపెడతారన్నమాట. చదివినంతా ముఖస్థంగాఉండి సమయోచిత స్ఫూర్తీ, లోకానుభవమూ అసాధారణ ధారణాపటిమా, జగద్విఖ్యాతికల కవిరాజుల నాటకాలకు ఆది మధ్యాంతాలూ విజయంకలగటంలో ఆశ్చర్యం ఏముంటుంది. సంస్కృత కవులరచనలను అనుసరించినవి అనువాదాలు, ప్రసిద్ధికథాభాగాలు గ్రహించి తగుపాటి మార్పులతో సాగించినవి స్వతంత్ర రచనలు. వాటికీ వీటికీ సాధారణంగా మూలాధారాలు పురాణాలే.

(ఇది ప్రస్తావన)

పురాణాంకము

వృద్ధులకు కన్యల నీరాదనీ, పరోపకారులు స్వసుఖాలు కోరరనీ, పతివ్రతలు మాననీయులనీ, పరకాంతాసక్తి పరిభవస్థానమనీ, బ్రహ్మతేజము దురుద్ధరమనీ, చాటుతోంది సుకన్య. కళ్ళుపొడిచిన రాజకన్యను పెండ్లాడిన చ్యవనమహర్షి, అశ్వినీదేవతల అనుగ్రహంచేత, కళ్ళు మాత్రమేకాక, నవయౌవనంకూడా సంపాదించుకొన్నాడు, కృతజ్ఞతాపూర్వకంగా, ఇంద్రాదులనుగూడా ప్రతిఘటించి, ఆ అశ్వినీ దేవతలకు యజ్ఞంలో హవిర్భాగం అర్పించాడు. ఇదీకథ. సర్వదేశసర్వకాలాలకీ అక్కఱకువచ్చేకవితయే ఉత్తమ కవితకదా! చూడండీ

గీ. కఱవులేకాని మఱియు రోగములెకాని
కలహములెకాని యెట్టియుక్కట్లుగాని
రాజలోపమ్మైన కాని రావుప్రజకు
రెండవది మంత్రిపమే లోనుండవలయు.

రాజవైద్యులుగూడ లంచము లిచ్చువారికిగాని మంచియౌషధము లీయరట.

ఉ. పన్నిదువారు హాలికులు వర్తకులుం గద వారితోడనే
యున్నదిలోకమెల్ల, వెలలొయ్యన హెచ్చెనరింత్రువారు, దా
నన్నరులెల్ల బీదలయి నాఁటికి నాఁటికి సారవంతమౌ
నన్నము లేమి రోగముల కాస్పదులై నశియింప కుందురే!

గీ. బాల్యమందున జదువు నేర్వంగవలయు
వయసువచ్చిన పదపడి భర్తయొద్ద
నే మిగులుదఁని దా బతియింపవలయు
గాని యన్యుడు గురుడింకగాడు సతికి.

తపశ్శక్తికన్ని శక్తులును లొచ్చుగా గలవు.

గీ. ఎన్నియో పాపములు చేసెనేని వానిఁ
కుదయమందు గుమారిక.

ఈవచనాల్లో సత్యం కొంతైనా ఉండకపోతుందా, పిష్టపశుయాగానికి దోహదమిచ్చినవాడూ, వైద్యులకపాంక్తేయత్వము తొలగించినవాడూ చ్యవనుడే.

దంభవామనము – భగవంతుడెట్టి వారికిసహాయుడగునో పరోపకార మొనర్చువారి తెలగెట్టిదో తెలియచేసే నాటకం. బలి మహాదాత – ఇంద్రాదుల మేలుగోరి వామనుడు బలిని ఒప్పించి మూడు అడుగులమేర సంపాదించాడు. ఒక అడుగులో భూమి అంతా ఆక్రమించాడు – ఒకఅడుగులో చిక్కిన స్వర్గాన్ని దేవతల కప్పగించాడు – మూడో అడుగుకు చోటు చూపించమని, పాపం ఆ రాక్షసచక్రవర్తిని పాతాళానికి తొక్కేశాడు. ఇదే కథ. చూస్తారా అదృష్టవిలాసాన్ని

చ. బలియుడు క్లేశమందుట యపాస్తబలుండు సుఖంబుచెందు టు
జ్జ్వల మతిగల్గుధీరునకు సంపదలేమియుఁ దెల్విలేని వా
డలఘుగతిన్ మహావిభవమందుట శూరపరాభవంబు, భీ
తుల విజయంబు నన్నదిబుధుల్ పరికింతురు దైవికంబుగన్.

"పన్నులు హెచ్చయ్యె భగవంతుడా
యెట్టు లీపైనిబ్రతు"కంచు నేడ్చువారు
"రాజానుచరులె చౌర్యములొనర్ప నికేటి
పరిపాలన" మటంచు వగచువారు
"సేమమ్ముగా బంట చేలుండినను దిక్కు
మాలిన కఱవంచు మఱుగువారు"

నేటివలె నాడును కలరన్నమాటేగా.

"దురాచారం బలవడినపిదప సిరి వెంటనే తొలగునని రాక్షస గురురూపంలో ఉన్న దేవగురువు చేసిన ఉపదేశం వింటారా ? "దేవుడు లేడు; ఆచార మక్కరలేదు; ధర్మశాస్త్రములు, పురాణములు, వేదములు మొదలగునవి నమ్మకూడదు; వర్ణాశ్రమ భేద మనవసరము; యజ్ఞములు మొదలైనవానికన్న దుష్కార్యములు లేవు; కడుపే కైలాసము; వివాహమిష్టము వచ్చినట్లు చేసికోవచ్చును; వావివరుసలు కించిత్కరములు; దేవాలయములు గూలద్రోయించుట వేదములు తగులబెట్టించుట చేయదగిన కార్యములు". బలి అంతవాడు ఈ ఉపదేశం ఎట్లా ఆమోదించాడో చూడండి.

మ. ఉపవాసమ్ము లటంచు మాడుచుట లే; దున్నాడు దేవుండటం
చవలాపించుట లేదు; వేటొకరిచే నాక్షేపణల్లేవు పా
పవు గార్యంబని పుణ్యకార్యమనియున్ వాదించుటల్లేవు; బా
గుపడున్ లోకము దీనిచే, నిజముగా గొండాటమింకేటికిన్.

దురుపదేశ మెక్కినట్టు మనమునకు సదుపదేశము లెక్కవుకదా.

'అనర్ఘ రాఘవము':—నారదుడు స్త్రీరూపమున చేసికొన్న పెళ్ళిముచ్చట– వానర రూపంతో వివాహ మాడిన సందర్భమూ పొందుపరచిన చిన్ననాటకం.

గీ. నారదుడు విష్ణుమాయచే నారియగును ।
పిదప దాళధ్వజుండను పేరినృపుని ।
వలచి పెండ్లాడి సంసారవార్ధిమునిగి ।
తుదకు దనరూపు దా గాంచు దోయజాక్షి ॥

సృంజయుండను రాజకుంజరుగృహమున
నానాళ్లు మాసములతనికొమిరె
మదయంతి పరిచర్య లొదలింప నివసించి
తనగాన విద్య న వ్వనితగరచి
పర్వతుని శాపమున గీశవక్త్రుడయ్యె
విద్య నేటెగిన యకన్య పేర్మికలిమి
నాపె బెండ్లాడి తుదకు శాపావసాన
మగడు సుందరుడై ముదమంది యుండె ॥

ఇది ఇతి వృత్తము. సంసారము తెలగెలుంగుదురా !

ఉ॥ సింగముకన్ననుంగడుకు బేష్టవొనర్చును, కారెన్మెకంబు క ।
న్నంగడు భీతిగొల్పు ఫణినాధునికన్నను గ్రూరమౌ; దవా
గ్నింగడలిన్ భయంకరవనిన్ దరియింపగవచ్చు నిచ్చ దా
టంగల వారలుండిరె జడంబగు సంసరణంపు సంద్రమున్.

విష్ణువేమిసేయు, విధి యేమిచేయును
శర్వుడేమిసేయు, జనుడు తనకు
దానబద్ధుడగు నిదానంబు దెలియమి
సాలె పురుగువోలె జనవరేణ్యా !

పర్వత నారదుల సంభాషణలో నాటకకర్తల జీవితవిశేషాలు కొన్ని తెలుస్తాయి.

గాన విద్యకొక్క దానికేగాదు; మీ
రీడు వచ్చునట్టి యెమ్మెలాడి
నితర పురుషునొద్ద నెందులకేనియు
నొప్పజెప్పకుండు యోగ్యులార !

అని ఒకఅనుభవజ్ఞుడు ఘోషించాడు.

దేవీభాగవతాది పురాణాలు ఈ మూడు నాటకాలకూ ఇతివృత్తుల్ని సమకూర్చిన మూలాలు. తగుమార్పులు కావించి స్వతంత్రకల్పనలతో కవు లీ రచనలు సాగించారు. అయిదాఅంకాల వఱకూ విస్తరించియున్నా వీరి రచనలలో ఇవిచాలాచిన్న నాటకాలు. వీటిరచనా కాలం నాటికి ఫార్సుతో కలిపి చిన్ననాటకాలాడే ఆచారం ఉన్నట్టు తెలుస్తుంది.

'ప్రభావతీ ప్రద్యుమ్నము':- అయిదంకాల నాటకం. శ్రీ తిరుపతిశాస్త్రిగారు తమ అవసాన దశయందు దీ న్నారంభించి ఒక అంకంమాత్రం ముగించి అందుకొంత భాగం మాత్రం ముద్రింపించి స్వర్గస్థులయిరి. మిగిలినది శ్రీ వేంకటశాస్త్రిగారి రచన అని చెప్ప బనిలేదుకదా ! అపూర్వకల్పనానల్పశిల్పిశిరోమణి పింగళి సూరనార్యుడు నాటక ప్రాయంగా 'ప్రభావతీ ప్రద్యుమ్నము' రచించెను. అందలి ఇతివృత్తమే ఈనాటక వస్తువున కాధారము. శుచిముఖప్రసంగం వచ్చినపుడల్లా శ్రీ తిరుపతి కవుల అసాధారణ ప్రతిభా విశేషాలు, వారి పరస్పరమైత్రి, ఎడబాటు చేకల్గిన దుస్తరదుఃఖభారమూ వ్యక్త మౌతూనే ఉంటుంది. నాలుగో అంకంలో అంతర్నాటక ప్రదర్శనం ఉంది. ఈప్రదర్శనమే రాక్షసులకు దుఃఖమూ, దేవతలకు సంతోషమూ సమకూరుస్తుంది. ప్రభావతిని ప్రేమించిన ప్రద్యుమ్నుడు, ఆమెతండ్రి అయిన వజ్రనాభుని చంపి రాక్షసరాజ్యలక్ష్మితోబాటు రాక్షస రాజపుత్రినిగూడ అర్ధాంగిగా నంగీకరించెను. దీనికంతకూ ప్రేరకుడూ అనుమోదకుడూ భారత నాటక సూత్రధారి అయిన శ్రీకృష్ణభగవానుడే.

## భారతాంకము

“భారతకథను తెలుగులో స్వతంత్రించి నాటకముగా రచించినవారే లేరు. ఒక వేళ నున్నను పాండవపద చిహ్నితమగు నామమునుంచినవారు లేరు. ఉన్నను ప్రసిద్ధులు లేరు. వ్యాసజననము – భీష్మ ప్రతిజ్ఞ – పరశురామగర్వభంగము – ధృతరాష్ట్ర పాండు రాజ విదుర ప్రాదుర్భావమూ– కర్ణోదయమూ – పాండవావతరణమూ – అను కథాభాగముల నాశ్రయించిన నాటకం పాండవజననము. వినండీ భీష్మప్రతిజ్ఞ –

శా॥ రాజ్యంబక్కఱ లేదునాకు, సకలారాతిక్షమానాధ సా
మ్రాజ్యంబుల్ లెసగెల్చి తెచ్చెదను, నీమన్మండె యీ సర్వమున్
బూజ్యుండై భరియింపగాగలడు, సోముండర్కుడున్ సాక్షులే
నే జ్యేష్ఠత్వము వానికిచ్చితిని నీ కింకేల ? శంకల్నృపా !

సర్వతంత్ర స్వతంత్రుడయిన వ్యాసమహర్షి మాతృభక్తి గనుడు.

క. తల్లియె వేదము శాస్త్రము
తల్లియె జపమున్ దపంబు తల్లియె గురువున్
దల్లియె సకలము తల్లియె
తల్లికి నెదిరించు వాడధమగతి నొందున్.

గీ. రాత్రియెల్లను విరహభారమున వేగి
వేగినంతన రాగ మావిర్భవింపఁ
బుష్పవతియైన పద్మిని పొందుజేయఁ
బోవుచున్నాడినుండు కాముకుడు వోలె.

ఈ వర్ణనను రాబోవు కుంతీ సూర్యుల ప్రణయమునకూ ఎంతచక్కని సాదృశ్యం ఉందో చెప్పటంకంటె ఊహించటమే తేలిక. వేట రాజధర్మం అనటంలోగల ఉద్దేశం గమనించండి.

ఉ. క్రూరమృగంబు లేవయినఁ గుంభిలికిన్ బ్రజకున్ దురంతమౌ
తీరు నుపక్రమింప నది తీర్చుటకై మృగయాపరత్వ మా
చారమటంచు దెల్పిరిటు, సాధుమృగంబులఁబట్టి చంపు టా
చారమె ? వీరధర్మమె ? యశస్కరమే ? పరమోపకారమే ?

అన్నిటికంటె చాలచిన్నది ఏకాంకా పూర్వనాటకం 'పాండవ రాజసూయము'. శిశుపాలవధ దీని ఇతివృత్తం. దాదాపు నాటకం అంత పెద్దది ప్రస్తావన. శ్రీ వెంకట శాస్త్రిగారు, బందరు హిందూహైస్కూలు వదలి వారి స్వగ్రామంచేరు దినాలలో రచించింది. ప్రస్తావన అంతా అన్యాపదేశమే.

'పాండవ ప్రవాసము':—ఎనిమిదంకాల నాటకం. ద్రుపదపరాభవం–బకసంహారం–మత్స్యయంత్రం ద్యూతం – అర్జునశాపం – సైంధవదురాగతం – ఉత్తరగోగ్రహణం – ప్రవాస సమాప్తి – ఇది కథాక్రమం. పంచమాంకంలోని ఊర్వశీఫల్గున ప్రసంగం శుక రంభాసంవాదాన్ని స్మరింప జేస్తుంది. మత్స్యయంత్రం తెగ్గొట్టిన వీరుడు విప్రుడే అని అంగవస్త్రాలు జారికొమ్ములకు ముడివైచి పాటులెట్లురణవ్యాపారాభిముఖులగుచున్నారో చూడండి ఎటూ చెప్పలేని ధృతరాష్ట్రుని దుస్థితి కనుగొంటారా?

చం. కొమరుని దుష్టచేష్టితముగూడ దటందునో? వాడు నేడె ప్రా
ణము లెడబాయు, వీరలనినన్ గడుమాన్యులు తండ్రియున్ గురుం
డమలినిబిత్తు లిద్ద్వరకు నాప్తులు నిక్కము పల్కుచుండి రీ
సమయమునాకు నెంతయును సంకటమైనను పట్టునక్కటా!

దుర్యోధనునకు భీముడంపిన సందేశం భావికథా సూచకంకాదా!

ఉ. నిండెను వత్సరమ్ములని నీ పతితో నృపుడాడినట్టు లు
ద్దండతజెప్పి పిమ్మట నతండదె వెండియు బృచ్ఛసేయ
జాలుమ్రండ సుయోధనుండ! యధముండ! త్రయోదశ వత్సరంబులే
నిండుటగాదు నిండెనట నీదగు నాయువునంచు దెల్పుమా!

నాటకా లన్నిటిలో ఉద్యోగవిజయా లగ్రగణ్యాలు. తొలినాటి విజయనాటకమే పిమ్మట ఉద్యోగవిజయ నాటకద్వయ మయింది. ఆఱంకాలనాటకం 'ఉద్యోగము' పార్థ దుర్యోధన వరసంపాదనం – కృష్ణరాయబారం – విశ్వరూప సందర్శనం – యుద్ధారంభం కథాభాగాలు. 'పాండవ విజయము' (ఉద్యోగవిజయాలు రెండూ కలిసి) ఆంధ్ర కవితా విజయమేలని అన్నాడు ఒకసహృదయుడు. ఏ ఘట్టంచూచినా, ఏ పద్యం చదివినా, ఏసన్నివేశం పరిశీలించినా, అనిర్వచనీయానందం కలగాలిసిందే, ఆశ్చర్యచకితులు కావలసిందే. కొన్నైనా ఉదాహరించాలంటే గ్రంథం పెరిగిపోతుంది. అయినా రెండు మూడు రత్నాలు మాత్రం.

మ. అరవిందాక్షునకు శేషశాయి జగదేకారాధ్యుఁడంభోధిజా
వరుఁడార్తావనదంగజాంగజుఁడు శ్రీవత్సాంకుఁడే
మో నిరంతర నిర్నిద్రుఁడు నిద్రవోయెడిపవల్; తచ్ఛీర్షఘంబక్కన
కృష్ణురునాథుండదె కూరుచుండె దళుకుల్ గుల్కంగ బీఠంబునన్.

చం. అలుగుటయే యెఱుంగని మహామహితాత్ముఁడజాతశత్రుఁడే
యలిగిననాఁడు సాగరములన్నియు నేకముగాక పోవు, క
ర్ణులు పదివేవురైన నని నొత్తురు చత్తురు రాజరాజ! నా
బలుకులు విశ్వసింపుము విపన్నులలోకులగావు మెల్లరన్.

శా. జెండాపై గపిరాజు ముందుసితవాజిశ్రేణియుంగూర్చి నే
దండంబున్గొని తోలుస్యందనము మీఁదన్ నారిసారించుచున్
గాండీవంబు ధరించి ఫల్గునుఁడు మూకంజెండుచున్నప్పుఁడొ
క్కండు నీకు మొనాలకింపఁడు కురుక్ష్మానాథ! సంధింపఁగన్.

ఉద్యోగవిజయాలలోని పద్యాలు కొన్నైనా నోటికిరాని ఆంధ్రభాషాభిమానులుండరంటే అతిశయోక్తి ఏమీ ఉండదు. రాజనీతి ధురంధరులలో శ్రీకృష్ణుడు అగ్రేసరుడని ఉద్యోగ విజయాలు వేనోళ్ళ చాటుచున్నవి. గమనిస్తారా అతని జోస్యము.

గీ. వేయిమంది భీష్ములు, పదివేలమంది
ద్రోణులును నూఱువేలకర్ణులును గలిసి
వచ్చినను, పార్థుచేతిలో జచ్చువారు
కృష్ణుడన నెవ్వఁడో కొంతయెఱిగి కొనుడు.

## అంతర్నాటకము

### విజయము

నాంది:—

హరివంచాయుథముల్ గడంగి విజయాహ్లాదంబు సంధించుతన్

సూత్రధారి (ప్రవేశించి) .... ...''నవరసాపణము జూడవలయు సంసారభార తరణమగునట్టి యా భారతరణమనుచు'' కదా నాకిచ్చిన యాదేశము. (పరిక్రమించి చూచి) అహో!

చం. వెనుకకులాగు బాహువులు బిగ్గఁగఁబట్టి ధనంజయుండు కో
పనుడు సుదర్శనాయుధుడు పార్థునితోడన వచ్చుచుండె ముం
దునకు; మహోశుగోద్ధతిని, దూగుచు సంభ్రమము సాంద్రభంగి ని
స్స్వనితముగాగ నేగుతటి సంయుతమాతరి యేపుదోపగన్

ఈజగన్నాటక సూత్రధారి సన్నిధానంలో నాకెందులకీ సూత్రధారిత్వము?

(నిష్క్రమించును.)

భీష్ముడు: మ. దయసేయుంగదవయ్యకృష్ణ త్రిజగత్కల్యాణ! మోక్షంబొగిన్
దయసేయుంగదవయ్య; చక్రమున మత్కంఠంబు వైకుంఠ! వే
గయిసేయుంగదవయ్య; ధర్మసుతునేకచ్ఛత్రసంపత్తిచే
గయిసేయుంగదవయ్య; నీకిదె నమస్కారంబు నారాయణా!

అర్జునుడు : ఉ. చక్రముదాల్చి నీవు రిపు చక్రము ద్రుంచు టదేమిలెక్క నీ
వక్రమమే యొనర్చునెడ నాగునె యీపదునాల్గులోకముల్
శక్రసుతుండు వీరుడను సద్యశమున్ గలిగింతువేని నీ
విక్రమమున్ మరల్చు మరవిందదళేక్షణ! భక్తరక్షణా!

భీష్ముడు : శా. "వచ్చెన్ భీష్ముడు వచ్చెవచ్చె" ననుచున్ జాపంబులంసంబులన్
గచ్చున్ విచ్చునుగా దగిల్చికొని చీకాకైన సైన్యంబు, వి
వ్వచ్చుంగూడి మురారి తేరికరుగన్ వైవర్ణ్యమున్ బాసె వీ
రోచ్చైర్నాదముగోదనీకుహారమందుచ్చందమై పర్వెడున్.

(తెరలో) రండు ఈవైపునకు రండు. అభిమన్యుని రణకౌశలము గనుకొనుడు.

ఉ. కత్తియుగత్తలంబుగొని కవ్వడిబిడ్డ విలోచనంబులన్
జొత్తిలు కెంపుచే మొగము సూరెల నెత్తురవడంగదంతిపై
మత్తమృగాధిపంబుఉకు మాదిరిగా నిదె వచ్చుచున్న వా
డుత్తరది యింకసింధునృపు డూపిరితో సమరంబు సేయుటల్.

[అభిమన్యుడు, పాండవులు ప్రవేశింతురు.]

ధర్మరాజు అభిమన్యుని కౌగలించుకొని :

ఉ. "శయ్యము సేయరమ్మ"ని త్రిగర్తులు పిల్వగ గెల్వబోయెమీ
యయ్య; గురుండు జేనికభయంబిడ నన్గొని తెత్తునంచు దా
నొయ్యన; నెందుజొత్తు? బలయోగ్రుడనంగ వెలుంగుచున్న వా
డ య్యనఘాత్ముడేది తెరువయ్య! వచింపుముమాకు పుత్రకా?

భీముడు: పెనుగదబూని శత్రువుల బిప్పియొనర్చుట తప్పనెన్నదుర్
బనివడి యిట్టివ్యూహములుపన్నుట విప్పుటయే నెఱుంగ; నా
కనువుగ వాడినూదిమొనయంత కదల్చితివేని జొచ్చి య
మ్మొనగలగుండు వెట్టిపడమొత్తెద మత్తగజంబుచాడ్పునన్.

అభి: ఈ యలంతికార్యమునకు నన్నింత బ్రతిమాల వలయునా ?

ఉ॥ ఆకలిమంటచే వడిదటాకముజొచ్చెడి యేన్గుగున్న య
ల్లాకురురాజ ఘోరపృతనాంబుజముల్ దగద్రుంచి ద్రోణునిం
దాకికలంచిమామలను దండ్రుల సంతసపెట్టకేనియున్
లేక "కిరీటినందనుడనే"యని యే నిక చెప్పికొందునే.

తండ్రులారా! నేనుబోయెద (నిష్క్రమించును)

ధర్మ: ఉ॥ దగ్గఱ లేరు మామయును దండ్రియు; ద్రోణునితోడిపోరు కా
దగ్గది; భార్యగర్భవతి; తల్లిసుభద్రత్వదేకపుత్ర; నీ
వగ్గనిరంకుశంబు; పసిపాపవు; పాపులువారు; మేనికిం
గగ్గురుపాటుపుట్టిగొడుకా! నినుయుద్ధముసేయ బంపగన్.

గీ. ఆడి యెన్నడు బొంకని వాడనేని
ధార్మికుడ నే నజాతశాత్రవుడనేని
బదుగు రొకటయి నినుగవయుదురుగాక
నీ క విజయంబుసుమి సుభద్రాకుమారా!

(భీమునుద్దేశించి)

ఉ॥ అంచితసత్వులౌ మన మహారథులివ్వను నాల్గువక్కలన్
బొంచికుమారు నేమఱక ప్రోచుచు దామరమొగ్గరంబువో
జించినవెంట నేరిపుల జిందరవందరచేసి మాట ద
క్కించుడి! గ్రమ్మఱన్ సుతుని కృష్ణసహోదరి కప్పగించుడీ!

(ఆకాశమున) దేవతలారా!

ఉ॥ చూచెదరేల? మీరయిన జొచ్చి తటాలున బ్రోవరయ్యా! సం
కోచము లేక క్రీడి కొడుకుం బదివుందియు నాల్గువైపులం
గాచి హయంబులం దునిమి కార్ముకముల్ విదళించి సారథిం
ద్రోచి రథంబు నేలబడ ద్రోసిరి కౌరవయోధు లక్కటా!

గీ॥ ఈసునుక్రోసముగల దు
శ్శాసనుసుతుఁ తోడనిట్లు సమరంబమరం
జేసి యభిమన్యుఁడాదౌ
శ్శాసనితోఁ గలిసి మెలసి స్వర్గము చేరెం

ధర్మ: (విని) హృదయమా! ఇంకను సిగ్గులేకయూరాట పడెద వేల (మూర్ఛిల్లును)

(తెరలో)

శా. సంతోషించెద వేల యేడ్వక కురుక్ష్మానాథ! వేమందితో
సుం[illegible]నం ద్రపలేక బాలుని గతాసుం జేసితీ వన్న వృ
త్తాంతంబుం విని సైచునే విజయుహార్యక్షుంబు? పాపాత్మ! నీ
యంతంబాతని చేతనున్నయది లేరా! నేటితో దీరెనే.

(కృష్ణార్జునులు ప్రవేశింతురు.)

కృష్ణు: కం. నీయన్నలకుం గుశలము
నీయనుజులకుం శుభంబు నిక్కంబుగ నే
దో యొక కొంచెమనిష్టం
బీయెడ నగుదానికింత యేటికి బొగులం

ధర్మ: (మూర్ఛ తేరి) హా! భువనైకశూరా! అభిమన్యుకుమారా!

అర్జు: (విని శోకముతో)

మ. చతురంభోధి పరీతమైన ధరణిం శాసింతువీవంచు న
మ్మితి నీకీతిగ దిక్కుమాలి రణభూమిం గూలితే కేశవ
ప్రతిరూపంబగు నీపరాక్రమము వ్యర్థంబాయెనే పోర నా
కుతుకంబంతయు నీటిబుచ్చితివిగా కుఱ్ఱా! జగన్మోహనా!

(తెరలో)

గీ॥ గురునిభయమున రాజంతిపురముఁజొచ్చె
భీముడాదిగ మేమెల్ల వెంటఁబోతి
మడ్డుపడి సైంధవుండట నభవదత్త
వరముచే దారిలో మీ కవార్యుఁడగుచు

అర్జు: (విని పండ్లు పటపటగొఱుకుచు) సైంధవచండాల! ఎంతపని చేసితివిరా? కృష్ణా! ఇదె నానిశ్చయము. వినుము.

ఉ. కావుమటంచు ధర్మజునికాళ్ల పయిఁ బడకున్న వేరిమై!
నీవుభరింతునంచభయమీయకయున్న గురుండుగాడుగా
రీవిభుడడ్డమై నిలువరించునుగాకని వెన్నుచూపుచుఁ
బోవకయున్న, సైంధవునిబోకడతుఁ రవిగ్రుంకునంతకుఁ.

(అందఱు నిష్క్రమింతురు)

(కృష్ణుడు పాండవులు ప్రవేశింతురు)

కృష్ణ: బావా! ధర్మరాజా! కొంచెము వాక్సహాయము చేసిన జాలును.

ధర్మ: అనృతమాడుటతప్ప మఱి యేదియేనియుం జేసెద.

కృష్ణ: నాకదియే కావలసినది.

మ॥ చదిసెఁ భీముగదా ప్రహారమున నశ్వత్థామ పేరింటిదే
గదమాతంగము; దానిమీద నెపముఁగల్పించి ముందన్నుమై
"నదిహాస్తీంద్ర" మటన్నమెల్లగ; నసత్యాలాపదోషంబునుం
డదు, కార్యంబుఫలించు, నంతభవదిష్ట ప్రాప్తిచేకూరెడుఁ.

ధర్మ: ఉ. తిండికి లేకపోయి పరదేశము లేగిన వచ్చుగాక వి
ప్రుండదిగాక దేశికుడు పూజ్యుడురిత్తవచించిచంప బ్ర
హ్మాండములన్నియుఁ దిరుగులాడవె? తుచ్ఛులతోడిపాటు కా
కుండు నెధర్మసంభవుడు నూరక యిట్టు ల సత్యమాడినఁ.

భీము: బావా! నేనేపోయి యింకొకసారి చెప్పిచూచెదను. (నిష్క్రమించును)

(తెరలో)

గీ॥ ఆడిబొంకనివాడు నీయగ్రభవుడు
వచ్చిచెప్పిన నమ్మగవచ్చుగాని
యనృతవాది వధర్మమార్గానుసారి
వేమిచెప్పిన నమ్మనో భీమసేన.

కృష్ణు: ధర్మజా!

ఒకవంక ననృతదోషం
బొకవంకగులక్షయాఘముంచి గురుత్వా
దిక మెంచి చేయుమీ ీతా
వకహిత కార్యంబు పెక్కువాదములేలా !

ధర్మ: (కోపముతో)

చం. ఒడబడడీపృథాగ్రతనయుం డనృతమ్ము వచింప, బోయి కా
రడవులలోని యద్రిగుహాలందు దపంబున సర్వకాలముఁ
గడపగలండుగాని: భుజగర్వము చాలిన ధార్తరాష్ట్రులఁ
గెడపి యశోభరంబున సుఖింపుడు శౌరియు మీరురాజ్యమున్.

(లేచిపోవును)

భీము: (ప్రవేశించి) కం॥ అవనీతలంబు నిష్పాం
డవమగు నొకక్షణము కుంభనందన బాణో
ద్భవదావకీల లార్పం
దివురక మనముంటిమేని ధీ నిధులారా !

(తెరలో)

కం. సంశయము వలదె రాజక
వంశక్షయమున్ బొనర్పవచ్చునె ? మానీం
ద్రాంశంబ కావొకో ? నీ
''వోంశాంతి శ్శాంతి'' చదువకుంటివె యెపుడున్.

హిడింబ : (ప్రవేశించి భీమునితో) మత్పుత్రఘాతియగు కర్ణుం జంపుటకు నన్ననుమతింపుము.

భీము : అందులకు నీవెందుకు. ఇది వినుము. (చెవిలో నేమో చెప్పును)

హిడింబ : ఎంతపని. ఇదె నెఱవేర్చుచున్నదానను. (నిష్క్రమించును)

(తెరలో)

ఉ. "తనయునిచావు సత్య"మని ధర్మతనూజుడు వచ్చి చెప్పి పో
యిన తరువాత నస్త్రగురు "డీ ధనువేటికి, దూపులేటి ?" కం
చునువిడనాడి కౌంతవడి సూనునికై వగజెందిచెంది దై
వ నియతి బ్రహ్మరంధ్రమున బాణమువాసెను యోగపద్ధతిన్.

(అందఱు నిష్క్రమింతురు)

(ధర్మజ కృష్ణార్జునులు ప్రవేశింతురు.)

కృష్ణు : ఉ. అన్న జగత్ప్రసిద్ధుడు మహాత్ముడు ధర్మపరుండు సత్యసం
పన్నుడు దారమానసుడు వైరిపరాభవఖిన్నుడౌచు ని
న్నన్నది పాటిగా దలతురయ్య! ప్రతిజ్ఞ విరోధిపైన గా
కెన్నగ నన్నదమ్ములపయిన్ నెఱవేర్తురటయ్య! ఫల్గునా!

అర్జు : అన్నా! నేడు కర్ణునిం దునుమకున్న మాతాపితృగతులకుం దప్పువాడ. నన్ను దీవింపుము. (ధర్మజుడు దీవించును. కృష్ణార్జునులు నిష్క్రమింతురు.)

(తెరలో)

ఉ. ఓగురుపుత్ర! యోకృపుడ! యోకృతవర్మడ! రండు, కర్ణుడా!
లాగునడస్సియున్ దనబలంబున, గ్రుంగిన స్యందనాంగమున్
లాగినరాక కష్టపడులాగు గనుంగొను చూరకుండు ర
య్యా! గతిమాలు వాడగునొకో? యిక లేడు హితుండు గ్రుంగుటన్.

ఆ. వె. కర్ణుచావు చూడగా జాలకక్కట
రాజరాజు మొగము తేజమెడలి
దుఃఖసాగరమున ద్రోయంగబడియె ధై
ర్యంబుచెప్పి యరులనడతుగాక.

(ధర్మరాజు నిష్క్రమించును.)

(తెరలో)

ఉ. ఆజిని లోతునీటికొలనక్కట! పూచిన తమ్మికిన్ విధి
ప్రేరణ రాలిపోయినవి రేకులు తొంబది తొమ్మి దిప్పుడా
నీరజమందు దామిగులునే యొకటే, కటులుండెబో, యలం
కారములోనె యాకొలనుగాని సరోజముగాని భూమికిన్.

దుర్యో : (రక్తసిక్తాంగుడై ప్రవేశించి) ఎవరో నాతండ్రిని నన్నును నెత్తిపొడుచుచున్నట్టున్నది. కానిమ్ము. ద్వైపాయన హ్రదముచేరెద. (పరుగిడి ద్వైపాయన హ్రదము చేరును.)

(తెరలో)

ఉ. కొమ్మలుగాలిచే విఱుగగుంకటి వేరసియాడ జెట్టుపొం
కమ్మెడబాసియున్న సహకారము తీయనికాపుకాచునో
కమ్మనిపూతపూచునో! పికప్రముఖ ద్విజపాళిచేత జి
త్తమ్మునకింపుగూర్చునో సదా తెరువర్లకు నీడయిచ్చునో.

(కృష్ణుడు, పాండవులు హ్రదము సమీపింతురు)

పాండవులు. చ. చచ్చిరిసోదరుల్ సుతులుచచ్చిరి, చచ్చిరిరాజులెల్ల రీ
కచ్చకుమూలకందమగు కర్ణుడు మామయు జచ్చిరీగతిం
బచ్చనికొంపమాపితివిబాపురె! కౌరవనాథ! నీసగం
బిచ్చెదజీవితేచ్ఛగలదేని బయల్పడుమయ్య గ్రక్కునన్.

దుర్యో : పాండునందనులారా! ఏల ఈ మదాలాపములు. ధర్మనందనా!

ఉ. ఏలుమురాజ్య; మైతివిమహేంద్రుడ; వేనుబరిత్యజించితిన్
గాలముచేరువౌదనుక గానలలో దపమాచరింతు నే
నాలమొనర్పగాదగిన యాయుధముల్దరిలేవు యుద్ధమిం
కేల? భవన్మనోరథము లే నొడగూర్చుచునుండవిత్తరిన్.

(తెరలో)

గీ. అనుగునెచ్చెలి! నీవుచేసినప్రతిజ్ఞ
తప్పకుండగ నెఱవేర్పదలపుమయ్య
పాండవులబారి బడద్రోచెబట్టుపట్టి
నన్నుజండాల దురభిమానగ్రహంబు.

(ప్రకాశముగ)

గీ. అరదమైనను లేదు నిరాయుధుండ
నెదిరి మీతోడఁబోరుట యెట్టటంచు
బల్కితినిగాని మీరు తప్పదని రేని
గదలి చనుదెంచుచున్నాఁడ గాచికొనుడు. (మడుపు వెడలివచ్చును)

ధర్మ : కురునాథా! వంత చెందకుము. నీయిచ్చ వచ్చిన యాయుధంబులు గైకొని మా యేవురలో నీయభిమతంబగు వానితో గయ్యమొనర్పుము.

ఉ. ఈవు రణంబునన్ గెలిచెదేని, జయంబు వహించియేలు మీ
భూవలయంబు మేము వనభూములకేగెద మట్లుగాక నీ
వే వడినన్ ధరాభరణ మేము వహింతుము రాజరాజ! నీ
చావును జావకుండుటయు సజ్జనగణ్యముగా నొనర్పుమా!

దుర్యో : (తనలో) చచ్చిన భీమునిచేత నే చావవలయును. కడ తేర్చిన వానీనే కడ తేర్ప వలయును (ప్రకాశముగ) భీమసేనా! రా రమ్ము. స్వర్గాపవర్గప్రదమయిన రణ రంగమునకేగి గదా యుద్ధము గావింతము రమ్ము. (అందఱు నిష్క్రమింతురు)

[పుడమిమీద మూర్ఛమునిగియున్న దుర్యోధనుడు, పాండవులు, బలరామ కృష్ణులు కనుపింతురు.]

బల : (మండిపడి) కృష్ణా! ఇంకను నీనీచునెట్లు క్షమింతును.

చం. కసిగలదేని బాహుబలగర్వముచే గురురాజు నాజిలో
గసి మసగింత్రుగాక కొఱగాక గదారణమందు బాడిలే
కసముఖ మందొకండు శఠకార్యమొనర్చిన జూచి రాముఁడీ
ముసలముచేత వానితల ముక్కలుచేయక యూరకుండనే.

అయిన నిటనిలుచుట నాచేతప్పు. (నిష్క్రమించును)

దుర్యో : (మూర్ఛ తెలిసి) బలదేవా!

గీ. మధ్యవర్తివి రణధర్మమయుడవీవు
కలవనుచుగాక నే నూర్ధ్వకాయమునకు
గాపుదలచేసికొని యధఃకాయమునకు
జేసికోలేనె యకట వంచితుడనైతి.

[భీముడు కోపముతో దుర్యోధనుని తలదన్నబోవ ధర్మరాజు వారించును.]

ధర్మ : (సిగ్గుతోదనలో)

చం. మడిసిరిబంధుజాలము సమస్తము; రాజ్యము(బోవజాలు నే
కొడుకనుకంటినో యతడుగూలెను ముండితమూర్ధుడైన యీ
పుడమిబునర్భువున్ వయసుపోడిమిపోయిన నేనుసంతసం
పడుచు బరిగ్రహించుటకు బాల్పడజేసెనె దైవమక్కటా!

కృష్ణు : ఉ. ఇంటికిబోదమేల పదు నెన్మిదినాళ్ళుగతించె వీరికిన్
గంటికినిద్రలే దుదయకాలముదాకను బోదు(ప్రాణమీ
తుంటరి; కెంత సేపితనితో శవజాగరణంబు రండు మీ
బంటులుమీరు చేతులెదపైనిడి స్వస్థతవిశ్రమింపగన్.

(దుర్యోధనుడుతప్ప తక్కినవారందరు నిష్క్రమింతురు.)

అశ్వత్థామ : (కృపకృతవర్మలతో బ్రవేశించి) దుర్యోధన మహారాజ! పాఱిపోయిన పాండవపంచకంబును యుయుత్సుండును కృష్ణసాత్యకులునుదప్ప తక్కిన రిపుబలమెల్ల నామావశిష్టముగావించితిని.

దుర్యో: గురునందనా! గీ. నిన్ను ముదమునగనుగొని నీమొగంబు
గాన పాండవమునువిని మేనువాయ
(బ్రాణములనిల్పికొంటినో ద్రోణతనయ!
యిమ్మె కడసారి యాశ్లేషణమ్ము నాకు.

కృపా : కౌరవేశ్వరా! నీవు వారికంటె గడుసుకృతాత్ముడవు.

గీ. బాంధవులతోడ సకలసంపదలతోడ
(త్రిదివమున కేగుదువు జగద్విదితకీర్తి
వంశమాలేక తగినసంపదలు లేక
వారుజీవచ్ఛవంబులైనారు నేడు.

ఇంతదనుక మధ్యమ లోకదేవేంద్రుడవైవె యికబరలోకసౌఖ్య సామ్రాజ్య పట్టాభిషేకమునందనున్న నీకు గావలసినదేమియును లేదు. అయిన నిట్లగుగాక.